# జండా చతుష్పథం



1932 జనవరి నెలలో పోలీసు దౌర్జన్య ఫలితంగా ఆశ్రమ సభ్యుల రక్తంతో తడిసిన పవిత్రస్థలం

గాంధీయుగంలో ఆశ్రమాలు

# గౌతమీ సత్యాగ్రహ ఆశ్రమము

## సీతానగరం

రచన:

క్రొవ్విడి లింగరాజు




ప్రకాశకులు:

గాంధీ సాహిత్య ప్రచురణాలయం

గాంధీ జ్ఞానమందిరం - సుల్తాన్ బజార్

హైదరాబాదు - 500001

మొదటి కూర్పు

1000 ప్రతులు

జనవరి 1981

వెల రూ. 5-00

గాంధీయుగంలో ఆశ్రమాలు

గౌతమీ సత్యాగ్రహ ఆశ్రమము

సీతానగరము

115 వ ప్రచురణ

భారత ప్రభుత్వమువారు సరసమైన వెలకు అందచేసిన కాగితముపై ఈ పుస్తకము ముద్రించబడినది.

ముద్రణ:

ఉషా ఆర్టు ప్రింటర్సు

రాజమహేంద్రవరము-1

# ప్రకాశకుల నివేదన

గాంధీ సాహిత్య ప్రచురణాలయం గాంధీయుగానికి సంబంధించిన త్యాగధనులయిన మహాపురుషుల చరిత్రలను, ఉద్యమాల వృత్తాంతాలను, ఆ కాలంలో నెలకొల్పిన ఆశ్రమాలు, జాతీయ విద్యాలయాలు మొదలయిన నిర్మాణాత్మక సంస్థల చరిత్రలను సేకరించి ప్రచురించాలని నిర్ణయించింది. ఈ నిర్ణయాన్ని అనుసరించి స్వర్గీయులు శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ, శ్రీ పొట్టి శ్రీరాములుగారి జీవితచరిత్రలు ప్రచురించడం జరిగినది. ఆశ్రమాలు, జాతీయ విద్యాలయాల చరిత్రలు ప్రచురించడానికి కృషి చేస్తున్నాము.

గాంధీయుగంలో మహత్తరమైన పాత్ర నిర్వహించిన సీతానగరం గౌతమీ సత్యాగ్రహాశ్రమ చరిత్ర వ్రాయవలసినదిగా ఆ ఆశ్రమ నిర్వాహకులలో ఒకరయిన శ్రీ క్రొవ్విడి లింగరాజుగారిని ప్రార్థించినాము. వారు తగు ఛోగట్టా సేకరించి "వేదిక" లో ప్రచురించారు. అయితే ఇంకా వివరంగా దానిని గ్రంథస్థం చేయవలసిందిగా అర్థించగా దయతో దానిని వివరాలతో పూర్తిచేశారు. లింగరాజు గారికంటె అధికారపూర్వకంగా ఈ ఆశ్రమ చరిత్రను వ్రాయగలిగిన వారెవరూ ఇప్పుడు లేరనడం నిర్వివాదాంశం. ఇంతకాలానికైనా ఈ ఆశ్రమ చరిత్ర పాఠకలోకానికి అందచేయ గలుగుతున్నందుకు సంతోషిస్తున్నాము. పాఠకలోకం ఈ పుస్తకాన్ని ఆదరిస్తారని విశ్వసిస్తున్నాము.

త్వరలోనే పినాకినీ సత్యాగ్రహాశ్రమ చరిత్ర, వినయాశ్రమ చరిత్ర, ఆంధ్రజాతీయ కళాశాల చరిత్ర ప్రచురించగలమని ఆశిస్తున్నాము. ఈవిధంగా ఆ కాలపు వివరాలు ప్రచురిస్తే సమగ్రమైన ఒక చరిత్రకు ఆధారభూతాలు

కాగలవు. తెలుగులో గాంధీయుగపు సాహిత్యరచన అంతగా జరుగకపోవడం దురదృష్టకరమని చెప్పాలి. రచయితలు, పాఠకలోకం అభిమానించి చేయూత నిస్తే ఆ కొరతను కొంతవరకయినా తీర్చగలమని మా విశ్వాసం.

ఈ పుస్తకం మా 115 వ ప్రచురణ. దీనిని శ్రమకోర్చి రచించిన శ్రీ క్రొవ్విడి లింగరాజు గారికి మా హృదయపూర్వక కృతజ్ఞతలు. ముద్రాపకులు శ్రీ N. V. చౌదరి గారికి మా హృదయపూర్వక ధన్యవాదాలు.

ఇట్లు,

కోదాటి నారాయణరావు
కార్యదర్శి,
గాంధీ సాహిత్య ప్రచురణాలయం.

హైదరాబాదు
తేదీ 10-1-'81





సీతానగరం గౌతమీ సత్యాగ్రహాశ్రమ స్థాపకులు, మహాత్యాగి, స్వాతంత్ర్య సమరనాయకులు
డాక్టర్ శ్రీ బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యం, ఆయన సతీమణి కామేశ్వరమ్మగారు.

# గాంధీయుగంలో ఆశ్రమాలు

## సీతానగరం గౌతమీ సత్యాగ్రహాశ్రమము

భారత స్వాతంత్ర్య చరిత్రలో గాంధీయుగం స్వర్ణయుగమని చెప్పాలి. అంతవరకు విశ్వవిద్యాలయాల యావరణలనుండి బయటపడినవారి హస్తగత మాత్రమైయుండిన రాజకీయనాయకత్వము అప్పటినుండి పల్లెటూళ్ళలోవుండే సాధారణప్రజలకు సంక్రమించింది. కొద్దిమంది విద్యాధికులకు శీతాకాలపు వ్యాసంగముగా నుండిన కాంగ్రెస్ సంస్థ, సామాన్యప్రజల స్వాతంత్ర్య వాంఛాతృప్తికి సాధనమైన ఉద్యమముగా రూపొందింది. ఈ ఉద్యమ వ్యాప్తికి గాంధీజీ, ఆశ్రమముల నొక సాధనంగా ఉపయోగించాడు.

గాంధీజీ నాయకత్వాన్ని అత్యుత్సాహంతో శిరసావహించిన ఆంధ్ర దేశంలో, ఆ కాలంలో అనగా 20 వ శతాబ్దపు మూడవ దశాబ్దంలో వెలసిన ఆశ్రమాలలో గోదావరీ నదీతీరాన సీతానగరంలో వెలసిన సత్యాగ్రహాశ్రమ మొకటి. స్వాతంత్ర్య పోరాటాల కాలంలో సీతానగరం గౌతమీ సత్యాగ్రహాశ్రమమూ, దాని స్థాపకుడైన డాక్టర్ బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యం, ఆయన అనుచరవర్గమూ చేసిన సేవ చాలా వివిధమూ, విశిష్టమూ అని చెప్పాలి. ఆశ్రమము స్వాతంత్ర్యపోరాట కాలంలో తరచు పోలీసు హంగామాకు గురికావడంచేత వాటితాలూకు రికార్డులు లభ్యంకావడంలేదు. కాని, జ్ఞాపకం వున్నంతవరకు దాని చరిత్రను గ్రంథస్థం చేయడానికి ప్రయత్నిస్తాను.

సుమారు 20 సంవత్సరాలు గాంధీజీ దక్షిణాఫ్రికాలోని భారతీయుల పక్షాన, శ్వేతజాతుల అహంకారాన్ని ఎదిరించడానికి ఎన్నోవిధాల పాటుపడి 1914 సం॥లో భారతదేశానికి తిరిగివచ్చాడు. దక్షిణాఫ్రికాలోనే ఆయన అహింసాయుత ప్రతిఘటన గురించిన ప్రధమ పాఠాలను నేర్చుకున్నాడు. సత్యాహింసలగురించి ఎన్నో పరిశోధనలు, ప్రయోగాలు చేశాడు. నిష్ఠాయుత

మైన నిరాడంబర జీవితాన్ని అలవాటు చేసుకోడానికి సాధనంగా ఆశ్రమ జీవితాన్ని ప్రారంభించాడు. బహుశా దక్షిణ ఆఫ్రికాలోని ట్రాన్స్‌వాల్ కొండల లోని ట్రాపిస్టు మిషన్‌వారి సెటిల్‌మెంటు జీవితం ఆయన నీవిధమైన జీవిత విధానానికి పురిగొల్పి యుండవచ్చును. అచ్చట భారతీయసమస్యలపై జనరల్ స్మట్స్‌తో ఒడంబడిక జరిగిన పిమ్మట గాంధీజీ భారతదేశానికి తిరిగివచ్చాడు.

అప్పట్లో భారతీయ రాజకీయాలలో అగ్రపీఠంలోనున్న ఇండియన్ నేషనల్ కాంగ్రెస్‌కు శ్రీ ఫిరోజిషా మెహతా సర్వాధికారి. గోపాలకృష్ణ గోఖలే ఆయన అనుచరులలో ప్రధానుడు. గోఖలే రాజకీయములు గాంధీజీ నాకర్షించాయి. ఆయనను తన రాజకీయ గురువుగా నంగీకరించాడు, దాదాపు 1919 సం॥రం వరకు గాంధీజీ భారత రాజకీయరంగంలో పరిశీలకుడుగానే వుండిపోయాడు. ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ మితవాదుల నాయకత్వము నుండి తప్పుకుని లోకమాన్య తిలక్, అనిబిసెంట్ వంటి అతివాదుల వశమైన కాలం. ఆ కాలంలోనే గాంధీజీ వస్తుతత్వంచేత మితవాదియైనా, కాలపరిస్థితుల వలన అతివాది యైనాడు.

దక్షిణాఫ్రికాలోని సత్యాగ్రహప్రయోగాన్ని విస్తృతరంగంలో భారత దేశంలో ప్రయోగించాలనేసంకల్ప మాయనకుకలిగింది. ఆదృష్టితోనే ఆయన దేశంలో సంచారంచేసి అహింసాత్మకమైన సత్యాగ్రహసిద్ధాంతాన్ని ప్రచారం చేశాడు. అందుకు సుశిక్షితులు, ఎటువంటి త్యాగాలకైనా సంసిద్ధులు కాగల అనుచరవర్గాన్ని తయారు చేసుకోవలసిన కారణంగా అహమ్మదాబాదు సమీపములో సబర్మతీ నదీతీరాన సత్యాగ్రహాశ్రమాన్ని నెలకొల్పేడు. సత్యం, అహింస, బ్రహ్మచర్యం, ఆహారనియమం యిత్యాది వ్యక్తిగత శిక్షణనిచ్చే ఆశ్రమముగా దానిని రూపొందించాడు.

ఆ కాలంలో ఆయన వేషభాషలు, భావాలు, రాజకీయ అభిప్రాయాలు భారతీయనాయకులను, ప్రజలను ఆకర్షించాయి. భారత స్వాతంత్ర్యపోరాటం తుదిముట్ట సాధించగల నాయకుడు గాంధీయే అని లోకమాన్యునివంటి మహాపురుషులు ఆయనను గుర్తించారు.

# 3

# పంజాబ్ విషాదగాథ

ప్రథమ ప్రపంచ సంగ్రామంలో బ్రిటిష్‌వారు శత్రువుల ప్రతిఘటనకు తలమునకలుగా నున్నప్పుడు భారతదేశం వారికి సర్వస్వమొడ్డి సహాయం చేసింది. దాని ఫలితంగా భారతజాతి జన్మహక్కైన స్వరాజ్యాన్ని బ్రిటన్ ప్రసాదిస్తుందని ఆశించారు. ఏరుదాటి తెప్ప తగలేసినట్లు ఆపత్తునుండి తెప్పరిల్లిన బ్రిటన్ మన మన్నమడిగితే సున్నమిచ్చింది.

భారత స్వాతంత్ర్య వాంఛలను అడుగంటింప జేయడానికి సర్వ స్వాతంత్ర్యాలను నాశనంచేసే రౌలట్‌శాసనాలను ప్రసాదించింది. ఆ చట్టాల నెదుర్కోడానికి గాంధీజీ సాత్విక నిరోధోద్యమాన్ని ప్రారంభించాడు. అమృతసర్‌లో జలియన్‌వాలాబాగ్‌లో అమాయకప్రజలను జనరల్ డయ్యర్ మందుగుండు సామగ్రి అయిపోయేవరకు కాల్చి చంపినఘట్టం చరిత్ర ప్రసిద్ధమే. ఆ సంఘటనే గాంధీమహాత్ముని సహాయనిరాకరణోద్యమానికీ, నాయకత్వానికీ నాంది యైనది. కలకత్తాలో జరిగిన కాంగ్రెస్‌లో పంచ బహిష్కారయుతమైన సహాయ నిరాకరణోద్యమము మొలకెత్తింది. క్రమంగా ఆ మొలకే వేరుతన్ని మహావృక్షమయింది.

గాంధీజీ నాయకత్వంలో 1921 సం॥రం దేశం అంతా బ్రిటిష్‌వారితో శాంతియుతమైన పోరాటాన్ని సాగించింది. సంవత్సరాంతంలో బ్రహ్మాండమైన ప్రతిఘటనోద్యమం శాంతియుతంగా సాగింది. లాలాలజపతిరాయ్, దేశబంధుదాస్, మోతిలాల్ నెహ్రూ, ఆలీ సోదరులు మొదలైన భారతీయ నాయకు లెందరో చెరశాలలో బంధింపబడ్డారు. బ్రిటిష్ నిరంకుసత్వము బాహాటంగా నగ్ననృత్యం చేసింది.

ఆంధ్రదేశంలో నిగ్గుదేరిన నాయకులు మూడువందలమంది రాజమండ్రి చెరశాలలో బంధింపబడ్డారు. కొందరు కడలూరులో బంధింపబడ్డారు. ఈలోగా మహాత్ముడు చౌరీచౌరాలో ప్రజలు అహింసాయుత సిద్ధాం

తాన్ని పాటించకుండా అధికారులమీద దౌర్జన్యం జరిపినారనే కారణంగా మూకసత్యాగ్రహ ప్రయత్నాలకు స్వస్తిచెప్పాడు. ఆ పిమ్మట ఆయనను బ్రిటిష్‌వారు అరెస్టుచేసి 6 సం॥లు శిక్షవిధించి యరవాడ జైలులో నిర్బంధించిన గాధ చరిత్రప్రసిద్ధమే.

ఉద్యమ ఉపసంహరణము అగ్రనాయకులకు ఆగ్రహం కలిగించింది. సాధారణ అనుచరవర్గంలో అసంతృప్తి కలిగించింది. జైలులోవున్న ఆంధ్ర మిత్రులు కొందరు, సహాయనిరాకరణోద్యమం ఆకర్షించిన యువకులు చెదరిపోకుండా వుండాలనే వుద్దేశ్యంతో ఆశ్రమాలను స్థాపించాలనుకున్నారు.

# డాక్టర్ బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యం

కొందరు అలాంటి ఆశ్రమాల స్థాపనకు రూపురేఖలు దిద్దారు. 1921 సంవత్సరంలోనే గాంధీజీకి అత్యంత సన్నిహితులైన శ్రీ దిగుమర్తి హనుమంతరావుగారు నెల్లూరు జిల్లా పల్లెపాడులో ఒక ఆశ్రమాన్ని స్థాపించారు. ఆయన అకాలమృత్యువు పాల్పడడంచేత ఆ ఆశ్రమం రావలసినంతగా వెల్లడికి రాలేదు.

1922_23 సం॥లు కాంగ్రెస్ ఉద్యమంలో దారితెన్నులు కనబడని కాలం. గాంధీజీ జైలులో వుండడం, బయటనున్న నాయకులు రెండువర్గాలుగా చీలి కొందరు శాసనసభా కార్యకలాపములపై పుకు మొగ్గడం జరిగింది. రెండవ వర్గంవారు గాంధీజీ చెప్పిన నిర్మాణకార్యక్రమాలను అనగా ఖద్దరు అస్పృశ్యతా నివారణ, హిందూ-ముసల్మాన్ ఐక్యత యిత్యాది కార్యక్రమాలను నిర్వహించడం జరిగింది, అయితే యీ వర్గంవారి దృష్టిమాత్రం సత్యాగ్రహంమీదనే వుండేది. ఎక్కడైనా బ్రిటిష్ అధికారాన్ని ధిక్కరించే ఉద్యమమంటూ రేగితే దానికి సహాయంచేయాలనే ఆవేశంలో వుండేవారు. నాగపురంలో 1923 సం॥లో జరిగిన జండా సత్యాగ్రహం అటువంటిదే,

ఆశ్రమ స్థాపనకు భూరి విరాళ
మిచ్చి కారకులైన
సేఠ్ జీవన్ లాల్
ఆశ్రమానికి విచ్చేసినపుడు
తీయబడిన ఛాయాచిత్రం.
(1927)



క్రిందివరుస : ఆశ్రమం దేశీయ విద్యాలయంలో చదువుకుంటున్న బాలురు.
మధ్యవరుస : క్రొవ్విడి లింగరాజు, నీరుకొండ వెంకటరత్నం, మధ్యకూర్చున్నవారు సేఠ్ జీవన్‌లాల్, ప్రక్కన డా॥ సుబ్రహ్మణ్యం, ఓలేటి నరసింహం, కొప్పాటి సుబ్బారావు (హిందీపండితుడు)
పైవరుసలో : 3వ వారు రామచంద్రుని వెంకటప్ప, మద్దూరి కృష్ణమూర్తి, ఆదినారాయణ, వంగల సత్యనారాయణ, (ప్రెస్సులోపనివారు) తేతలి సుబ్బారావు (వైద్యాలయంలో కాంపౌండరు) ధరణీప్రగడ వేంకటగిరిరావు, మామిడి లక్ష్మీపతి, మాచిరాజు రామచంద్రమూర్తి (బండరా[illegible])

1920 సం॥రం నాటికి రాజమహేంద్రవరంలో వైద్యవృత్తిలో వుండి పుష్కలంగా ధనసంపాదనచేస్తూ వుండిన డాక్టర్ బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యం గారొక ప్రముఖవ్యక్తి. కలకత్తాలో జాతీయవాదియైన డాక్టర్ మల్లిక్ జాతీయ వైద్య విద్యాలయంలో శిక్షణపొంది 1917 సంవత్సరంలో రాజమండ్రిలో ప్రాక్టీసు ప్రారంభించారు. అమృతహస్తుడు కావడంచేత అతి శీఘ్రకాలంలో వృత్తిలో అగ్రశ్రేణి కొచ్చారు. కలకత్తా జీవితంవల్ల ఆయనకు కించిత్ విప్లవోద్యమ నాయకులతో కూడా స్నేహం కలిగింది. పదిమందిని చుట్టూ చేర్చుకోగలిగిన విశేషమేదో ఆయనలో వుండేది. ముఖ్యంగా విద్యార్థులు ఆయన దర్బార్‌లో చేరేవారు, అతివాద పత్రికలు, విప్లవగ్రంథాలు ఆయనదగ్గర కొచ్చేవి, అవి అస్మదాదులైన యువకులకందేవి. అప్పట్లో జాతీయోద్యమానికి సంబంధించిన యేపనికైనా ఆయన అగ్రస్థానం వహించేవారు. కాంగ్రెస్ అనుబంధ సంస్థయైన డివిజనల్ అసోసియేషన్‌కు ఆయన కార్యదర్శి.

1920 సం॥రంలో గాంధీజీ సహాయనిరాకరణోద్యమాన్ని ప్రారంభించినపుడు ఆయన ఆ వుద్యమంలో అనుచరులతో సహా ముందుకొచ్చారు. 1920 సం॥ ఓట్ల బహిష్కరణోద్యమంలో ఆయన గోదావరిజిల్లా అంతా సంచారంచేసి ప్రజల నుత్తేజపరిచారు. జలియన్‌వాలాబాగ్ హత్యలగురించి ఆయన వుపన్యాసం యిస్తుంటే వేలాదిప్రజలు ఆవేశపూరితులై ఏ త్యాగానికైనా సిద్ధపడేవారు. 1921 సం॥రం మార్చిలో విద్యార్థులను కళాశాలలను బహిష్కరించమనే నిర్ణయం జరిగింది. రాజమండ్రిలో ఆ కార్యక్రమాన్ని ప్రోత్సహించడానికి యితర స్థానికనాయకు లెవ్వరూ ముందుకు రాలేదు. శ్రీ గజపల్లి రామచంద్రరావు, డాక్టర్ పాలకోడేటి గురుమూర్తి ప్రభృతులైన నాయకులు- 1907 సం॥లో వందేమాతరం వుద్యమంలో విద్యార్థులకు కలిగిన యిక్కట్లును పురస్కరించుకుని, 1921 సం॥లో ముందుకు రాలేకపోయారు. అప్పుడు శ్రీ సుబ్రహ్మణ్యం విద్యార్థులకు నాయకుడైనాడు. ఆంధ్రరత్న

గోపాలకృష్ణయ్య అధ్యక్షతన రాజమండ్రిలో గోదావరిజిల్లా విద్యార్థిమహాసభ జరిగింది. ఆ సభ ఫలితంగానే శ్రీ మద్దూరి అన్నపూర్ణయ్య, మొసలికంటి తిరుమలరావు, కాండ్రేగుల రామచంద్రరావు, సబ్నవీసు కృష్ణారావు అన్నదాదులు 55 గురు చదువులకు స్వస్తిచెప్పి కాంగ్రెస్ సేవకు దీక్షితులైనారు. దానికంతకూ కారణభూతులు సుబ్రహ్మణ్యం, బులుసు సాంబమూర్తి గార్లు. ఆనాడు కాంగ్రెస్ సేవకు అంకితమైనవారిలో ఏకొద్దిమందో తిరిగి కళాశాలల్లో జేరినారు. చాలమంది దేశసేవకే అంకితమైనారు. అలాటివారి జీవితాలను భోగభాగ్యాలనుండి దేశసేవకు మరలించిన కారణంగా వారి బాధ్యత తనదిగా శ్రీ సుబ్రహ్మణ్యం భావిస్తూవుండేవారు. వారికి గ్రాస వాసోదైన్యం లేకుండా చూడవలసిన బాధ్యత తనకుంది అనుకునేవారు. వారినొక పంథాలో నడిపించాలని ఆవేదన పడుతుండేవారు ఆయన వెంటనుండేమేము స్వాతంత్ర్య వుద్యమాల్లో విజృంభించడానికి అవకాశం యెప్పుడు దొరుకుతుందా అనే కోరికతో, కాలక్షేపం కోసం రాట్నాలు వడుకుతూ, హిందీ నేర్చుకుంటూ, యింటివద్ద భోజనంచేసి కాంగ్రెస్ కార్యాలయంలో కాలం వెళ్ళబుచ్చుకునే వాళ్ళం. గ్రామసీమలగురించి గాంధీజీ చెప్పిన పాఠాలను నెమరువేసుకుంటూ ఏదో సావకాశం కలిగించుకుంటూ గ్రామాలలో తిరిగి కాంగ్రెస్ సంగతులన్నీ ప్రజలకు చెబుతూండేవాళ్ళం.

1923 సం॥రంలో కాకినాడ కాంగ్రెస్ మూలంగా చేతినిండా పని తగిలింది. 1924 సం॥రంలో గాంధీజీ విడుదలైనారు. ఆయన రాట్నం, ఖద్దరు తప్ప వేరే సూక్ష్మాన్ని యేమీ చెప్పేస్థితిలో లేడు. ఏ సత్కార్యానికైన ఎవరో ఒక మహాపురుషుడు నిమిత్తమాత్రంగా రంగంలోకి వస్తాడు. అల్యూమినియం వ్యాపారానికి రాజమండ్రి ఒక ముఖ్యకేంద్రం. ఆ వ్యాపారానికి భారతదేశ మంతటికి పెద్ద వ్యాపారస్తుడు శ్రీ సేఠ్ జీవన్‌లాల్. ఆయన గొప్ప కాంగ్రెస్ అభిమాని, అందులోను నిర్మాణకార్యక్రమమందు విశ్వాసము కలవాడు; గాంధేయుడు. ఆయన 1924 సం॥లో వ్యాపారరీత్యా రాజమండ్రి

వచ్చి తన స్థానిక వుద్యోగులవలన శ్రీ సుబ్రహ్మణ్యంగారిని గురించి విని ఆయనను తనయింటికి ఆహ్వానించాడు. తాను వ్యాపారంలో సంపాదించే లాభంలో కొంతభాగాన్ని ఆ ప్రదేశంలో జాతీయ కార్యక్రమానికి ఖర్చుపెట్టాలని సంకల్పించినట్లు చెప్పేడు. అప్పట్లో శ్రీ సుబ్రహ్మణ్యంగారు నిర్వహిస్తున్న జాతీయ విద్యాలయానికి సేఠ్ జీవన్‌లాల్ ముద్రణాయంత్రం కొరకు రెండువేల రూపాయల నిచ్చాడు. ఆ ముద్రణాలయంలోనే అన్నపూర్ణయ్య, నేను, మరికొందరు మిత్రులు కలసి సుబ్రహ్మణ్యం గారి సహాయంతో నిర్వహిస్తూ వుండిన "కాంగ్రెస్" పత్రిక అచ్చు అవుతూవుండడంవలన ఆ విరాళాన్ని ఉభయతారకంగా స్వీకరించడం జరిగింది. జీవన్‌లాల్‌గారే మరొకసారి వచ్చి గ్రామాల్లో నివాసమేర్పరచుకునే కాంగ్రెస్ సేవకులకు సంవత్సరానికి రు. 2500/-లు యిస్తానని, అందు కెవ్వరైనా సిద్ధంగా వున్నారా యని సుబ్రహ్మణంగారి నడిగేడు. సుబ్రహ్మణ్యంగారు యేపనీ ఒంటరిగా చేయలేకపోయేవారు; తోడులేకండా యెక్కడికీ కదిలేవాడు కాదు. అందుచేత నాబోటివారిని కొందరిని అందుకు సిద్ధంకావాలని అడిగేరు. మే మేనిర్ణయానికి రాలేని స్థితిలో ఒకరోజున ఆయన తన కుటుంబంతో సహా సీతానగరం వెళ్లిపోవడానికి ముహూర్తం పెట్టేరు.

రాజమహేంద్రవరానికి 13 మైళ్ళ దూరంలో సీతానగరాన్ని ఆయన వరించడంలో కొంత న్యాయమున్నది. అప్పట్లో రాకపోకల సౌకర్యాల విషయంలో సీతానగరం చాలా వెనుకబడిన ప్రదేశం. గోదావరిగట్టుతప్ప సాఫీయైన రోడ్డులేదు. గోదావరిలో పడవమీద ప్రయాణంచేసి ఊళ్లోకి రెండు మైళ్లు నడిచివెళ్లాలి. వేసవికాలంలో మాత్రం నాటుబళ్లు సాగేవి. వ్యవసాయ దృష్ట్యా అది మెరకప్రాంతం. కనుక ధనవంతమైన ప్రాంతం కాదు. అలాంటి ప్రాంతాన్ని సుబ్రహ్మణ్యంగారు ఎన్నుకోవడానికి కారణం అచటి ప్రజల రాజకీయ చైతన్యమే. ఏటిపట్టని పిలువబడే ఆ ప్రాంతం 1921 సంవత్సరంలో సహాయనిరాకరణోద్యమంలో ముందంజ వేసింది.

ఆ ప్రాంతంలోని గ్రామోద్యోగులు చాలమంది రాజీనామా లిచ్చేసి కాంగ్రెస్ ఉద్యమ వ్యాప్తికి తోడ్పడ్డారు. ఆనాటి బ్రిటిష్ కలెక్టర్ బ్రాకెన్‌కు నిప్పు, నీళ్లు పుట్టలేదు. కలెక్టర్ పేరుచెబితే కుప్పలు తిప్పలుగా దొరికే కోడి గ్రుడ్లు ఆయనకు మచ్చుకైనా దొరకలేదు. ప్రయాణానికి నాటుబండి కట్టేవారు కూడ లేకపోయేవారు. ఆ సందర్భంలోనే, రాజమండ్రి తాలూకానుంచి సామాన్య రైతుజనంలోంచి నాయకులు జైలుకొచ్చారు. నీరుకొండ వెంకట రత్నం, మారిన సుబ్బారావు, కోండ్రు వీరన్న, కొత్త విశ్వనాథం, కనగళ్ల నరసింహం, మద్దూరి పాపారావు, శ్రీపాద వెంకటాద్రియ్య, చాపర్ల సుబ్బన్న, తెలికిచర్ల వరాహస్వామి ప్రభృతు లెందరో ప్రభుత్వ నిరంకు శత్వాన్ని ధిక్కరించి జైలుకెళ్ళేరు. కొంతకాలంపాటు ఆ ప్రాంతం బ్రిటిష్ అధికారులకు ప్రక్కలో బల్లెంలా వుండేది. కనుకనే ఆ ప్రాంతాన్ని గ్రామ సేవా కేంద్రంగా సుబ్రహ్మణ్యంగారు వరించారు.

సామాన్య ప్రజలలో స్వాతంత్ర్య పిపాసను కలిగించడమే ఆనాటి కాంగ్రెస్ నాయకుల పరమలక్ష్యమని వేరే చెప్పనక్కరలేదు.

డాక్టర్ సుబ్రహ్మణ్యంగారు సీతానగరంలో నివాస మేర్పరచుకొనిన కొద్ది మాసాలకు 1924 సం॥ సెప్టెంబరులోనో, అక్టోబరులోనో సేఠ్ జీవన్ లాల్ రాజమహేంద్రవరంలో మకాం వేశారు. శ్రీ సుబ్రహ్మణ్యం ఆయనను లాంఛనప్రాయంగా కలుసుకున్నప్పుడు, సేఠ్‌జీ ఒక సూచన చేసారు : గ్రామ పునరుద్ధరణ గాంధీజీ కెక్కువ సమ్మతమైన కార్యక్రమం గనుక, ఎవరైనా కొందరు యువకులు ఏ గ్రామంలోనైనా ఒక ఆశ్రమాన్ని స్థాపించుకొని ఖద్దరు ప్రధానంగా నిర్మాణ కార్యక్రమాలని సాగించేయెడల తాను పదివేల రూపా యలను విరాళంగా యిస్తానని, ఏటేటా రూ. 2500/-లు యిస్తూవుంటాననీ ఆయన సూచించారు.

మీనమేషాలు లెక్కబెట్టి లాభనష్టాలు బేరీజు వేసే స్వభావం కాదు సుబ్రహ్మణ్యం గారిది. ఏదైనా మంచిపనికి పూనుకుంటే అది తప్పక ఫల

ప్రిదం అవుతుందనే విశ్వాసంతో, అటునుంచి నరుక్కురమ్మనే చొరవ ఆయన సొత్తు. అందుచేత ఆయన సేఠ్‌జీ సూచనకు సరే నన్నారు.

ఆశ్రిమానికి డబ్బు సంపాదించడంకన్న, యితరమైన ఆశలనూ, తగవులాటలను వదులుకుని జీవితాన్ని ఆశ్రమంద్వారా ప్రజాసేవ కంకితం చేయడానికి సిద్ధపడే యువకులు పదిమంది లభ్యంకావడమే సమస్య అయింది. అందునిమిత్తం ఆయన రాజమండ్రి తనతోవుండే ధరణీప్రిగడ శేషగిరి రావు, మద్దూరి అన్నపూర్ణయ్య, క్రొవ్విడి లింగరాజు, మానాప్రగడ కృష్ణా రావు, బండరాముడు అనే మాచిరాజు రామచంద్రమూర్తి మొదలైన కొందరు తూర్పు పశ్చిమ గోదావరిజిల్లా మిత్రులను ప్రోత్సహించి ఆహ్వానించారు. జిల్లాలో సంచారంచేసి అనేకమంది మిత్రులతో యీ ప్రిస్తావన చేశారు.

ఆశ్రిమస్థాపనకు శ్రీ బులుసు సాంబమూర్తిగారి సహాయాన్ని అర్థిం చారు. ఆయన సీతానగర ఆశ్రిమనివాసానికి పూర్తిగా అంగీకరించకపోయినా సుబ్రహ్మణ్యంగారితో పూర్తిగా సహకరించడానికి అంగీకరించారు. అప్పటి తూర్పుగోదావరిజిల్లా రాజకీయనాయకులలో తాత్కాలిక అభిప్రాయభేదాలున్నా పని వచ్చినపుడు అందరూ శ్రీ సాంబమూర్తి నాయకత్వాన ఒక్కమాటమీద నిలబడి ఒక్కకట్టుగా వ్యవహరించేవారు. కనుక యీలాటి నిర్మాణాత్మక మైన కృషికి శ్రీ సాంబమూర్తి మనసా ఆశీర్వదించడమే కాకుండా, ట్రస్టీగా వుండడానికికూడా అంగీకరించారు. శ్రీ కళా వెంకట్రావు తాను నివాసంగా వుండకపోయినా ఆశ్రిమసభ్యునిగా వుంటానన్నారు. శ్రీ తిరుమలరావు ప్రభృతులంతా అదే అభిప్రాయాన్ని వ్యక్తపరిచారు.

అప్పట్లో గుంటూరుజిల్లా టంగుటూరి కరణంగారి కుమారుడు రామ చంద్రుని వెంకటప్ప కాకినాడలో వుండేవాడు. అతడు నెల్లూరులో హైస్కూల్లో చదువుకుంటూ గాంధీజీ ప్రభావానికి గురియై, యింటినుండి యెవ్వరికీ చెప్ప కుండా విశాఖజిల్లాకు పారిపోయి అచ్చట అచ్యుతుని వెంకట్రావు అనేపేరుతో కాంగ్రెస్ ప్రచారంచేసి 6 నెలలు శిక్షనుపొంది 1921 సం॥లో రాజమండ్రి

జైలులో సాంబమూర్తిగారి ఆశ్రయంలో పడ్డాడు. జైలునుండి విడుదలయిన తర్వాత, అతడు కాకినాడలో వుంటూ, తాలూకాలో కాంగ్రెస్ ప్రచారకుడుగా పనిచేస్తూండేవాడు. శ్రీ సాంబమూర్తిగారు అతనిని ఆశ్రమానికి అర్పితం చేసారు.

శ్రీ సుబ్రహ్మణ్యంగారితో చాలాకాలంనుంచి కూడావుండే ధరణీప్రగడ శేషగిరిరావు, అన్నపూర్ణయ్య, అతని సోదరుడు కృష్ణమూర్తి, రాజోలు వాస్తవ్యులైన వోలేటి నరసింహం, మానాప్రగడ కృష్ణారావు ప్రభృతులు ఆశ్రమంలో వుండడానికి అంగీకరించారు.

మా కుటుంబంతో చిరపరిచయం గల శ్రీ సుబ్రహ్మణ్యంగారు నేను సున్నితమయిన మనిషినని, కఠినమైన రాజకీయ జీవితంలో ఢక్కా-మొక్కీలకు ఆగలేనేమో నని సంకోచిస్తూ వుండేవారు. మంచిచెడులను నిదానంగా విమర్శించే అలవాటు చిన్నప్పటినుండి వుండడంచేత, మా దర్బారులో నన్ను లా మెంబరు అని పరిహాస మాడుతూండేవారు. వృద్ధులైన తల్లి దండ్రులను విడిచి రాలేమోనని సంకోచిస్తూ నన్నడిగినప్పుడు నేను ఒక్క-క్షణ మాలోచించి సరే నన్నప్పుడు అయనకు ఆశ్చర్యం సంతోషం కూడ కలిగేయి.

1924 సంవత్సరం నాటికే ఆంధ్ర యువజన స్వరాజ్యసభ తరపున అన్నపూర్ణయ్య ప్రారంభించిన "కాంగ్రెస్" పత్రిక నిర్వహణతో సన్నిహిత సంబంధం యేర్పడటంచేత పత్రికతోబాటు నేనూ ఆశ్రమంలొ జేరడానికి నిశ్చయించుకున్నాను. మొత్తంమీద అక్టోబర్ నెలాఖరు అయ్యేసరికి ఆశ్రమానికి అంకితం అయ్యే జనాభా తగినంతమంది కుదిరేరు. ఇక ఆశ్రమ నిర్మాణమే తరువాయి,

సేఠ్ జీవన్‌లాల్‌గారి ఔదార్యాన్ని శ్రీ సుబ్రహ్మణ్యంగారు, స్థానికంగావుండే కొత్త విశ్వనాధం, కనగళ్ళ నరసింహం, నీరుకొండ వెంకటరత్నం, కొండ్రు వీరన్న, పానుగంటి సూర్యనారాయణరావు పంతులు మొద

లైన పెద్దలకు తెలియజేసారు. ఆశ్రమ నిర్మాణానికి పది యెకరాల స్థలం చూడమని కోరేరు. సీతానగరానికి శివారుగావుండే వెంకటకృష్ణరాయపురం అనే లంకపూరుకు జేర్చి 14 యెకరాల గరువు ఆశ్రమానికి లాయకైన స్థలంగా పెద్దలంతా నిర్ణయం చేసారు. అది చాలామంది వాటాదార్లకు చెందిన పొలం. దాదాపు ఇరవై మందికిపైగా వాటాదారులని నాకు జ్ఞాపకం. ఆ భూమి ప్రక్కనుండే గొల్లరైతుల కౌలులోనున్నది. సాధారణంగా ఆ పొలం విలువ అప్పట్లో వెయ్యి పదిహేనువందలకన్న ఎక్కువలేదు. కాని కోరి వెళ్ళడంచేత వాటాదారుల పీకులాట ఒకపట్టాన తేలలేదు. ఏటిపట్టునవుండే లౌకికులు, పెత్తందార్లు యేకమై ఒక రాత్రంతా కచేరిచేసి సుమారు మూడువేల రూపాయలకు (2750+ఖర్చులు) బేరం పైసలు చేశారు.

నవంబరునెల 9 వ తేదీని తెల్లవారగట్ల నాలుగుగంటలకు శంఖుస్థాపన ముహూర్తం నిశ్చయం అయింది. కళా వెంకట్రావు కోనసీమ పండితులచేత ముహూర్త నిశ్చయం చేయించారు. జిల్లాలోను, రాష్ట్రంలోనూ వుండే పెద్దలందరికీ ఆహ్వానాలు పంపేం. అయితే అప్పటికి ఆ చేలలో జొన్న బాగా యెదిగున్నది. ఆ జొన్నపంట కోసుకునేవరకు ముహూర్తం ఆపమని కౌలుదారులైన గొల్లలు గోల ప్రారంభించారు. వారికి పంటనష్టానికి పెద్దమనుషులు నిర్ణయించిన ముదరా యివ్వడానికి అంగీకరించి పెట్రోమాక్సు లైట్ల సహాయంతో శంకుస్థాపన జరగవలసినచోట దాదాపు ఒక యకరం నేలలోవుండే జొన్నచేనును రాత్రికిరాత్రి అడ్డంపడి పీకేయడం జరిగింది. యీనాడు వినబడుతున్న 'శ్రమదానం' నినాదంతో నిమిత్తం లేకుండానే ఆశ్రమవాసులు, కళా ప్రభృతులైన ప్రతినిధులు కలసి నేలను చదునుచేశారు. సీతానగరం, వంగలపూడి, రఘునాథపురం, కొండేపూడి వగైరా పరిసర గ్రామాలనుండి అర్ధరాత్రి చలిలో వేలాదిమంది జనం వచ్చారు.

ఎక్కడో సంచారంలో వున్న శ్రీ సాంబమూర్తిగారు రాత్రిపూట తాళ్ళపూడి దగ్గర గోదావరిదాటి శిష్య సహితంగా యిసుకతిప్పల కడ్డంనడిచి,

ముహూర్తసమయానికి అందుకున్నారు. అంతవరకు ఈ ఆశ్రమానికి ఏమి పేరు పెట్టాలో కూడ యెవ్వరూ ఆలోచించలేదు. శాస్త్రోక్తమైన తంతుజరిగిన పిమ్మట సాంబమూర్తిగారు శంకుస్థాపనచేసి, ఆయన సహజ గంభీరస్వరంతో "గౌతమీ సత్యాగ్రహాశ్రమ"మని దానికి నామకరణం చేశారు.

"సబర్మతీ నదీతీరాన గాంధీజీ ఆశ్రమంలాగునే, గౌతమీతీరాన ఈ ఆశ్రమం వర్ధిల్లుతుంది" అని ఆశీర్వదించారు, దాదాపు అదే సమయానికి గాంధీజీ దగ్గరనుండి కూడ సందేశం వచ్చింది. "I hope the Ashram will radiate opinion" అని ఆయన సందేశం. "ఆశ్రమం భావ వికాసాన్ని కల్గిస్తుందని ఆశిస్తున్నాను" అని అప్పటికి ఆ సందేశానికి స్థూలంగా అర్థం చెప్పుకున్నాం. తరువాతి అనుభవాన్నిబట్టి, అనుభూతులనుబట్టి ఆ సందేశంలో ఎంత విశేషార్థము యిమిడియున్నదో తెలుసుకోగలిగేము. ఆ విషయం ముందుముందు విశదీకరిస్తాను.

ముందుగా శంకుస్థాపన చేసినచోట ఒకపాటి పెంకుటిల్లుకట్టి, మిగిలిన నివాసాలన్నీ తేలికగా తాటాకుతో పాకలు వేయాలని మా అభిప్రాయం, కానీ ముహూర్తబలం వల్లనో, యజమాని సంకల్పబలం వల్లనో, లేక అప్పటి ప్రజల అభిమానోత్సాహాల వల్లనో మా అంచనాలు అప్రయత్నంగా పెరిగిపోయాయి.

ఒకానొక భక్తుడు దాదాపు రెండు మూడు లక్షల యిటుకను, కాల్చేందుకు పుల్లను తెచ్చియిచ్చినాడు. ఆశ్రమం ఆవరణలోనే ఒకచోట యిటుక తీత జరిగింది.

మరొక భక్తుడు తన పొలంలోని పాచిచెట్లను, నేరేడుచెట్లను యిచ్చాడు. దానితో అప్రయత్నంగా నాలుగైదు బంగాళాపంపిణీ ఇళ్ళకు సరిపోయిన దూలాలు వగైరా కలప అమిరింది. కొంచెం ప్రయత్నం చేసేసరికి చావతాటిచెట్లనూ, గృహనిర్మాణానికి కావలసిన ఇతర కలపసామగ్రినీ ప్రజలు సంసిద్ధం చేశారు.

ఆశ్రమ నిర్మాణాలు జరిగేటప్పుడు దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారు వచ్చినప్పుడు తీయబడిన ఛాయాచిత్రం (1925)



క్రిందివరుసలో ఎడమనుండి : 1, 2 వారు గుర్తు తెలియడంలేదు. మూడవవారు పాలకోడేటి సూర్యప్రకాశరావుగారు.

మధ్యవరుస : శ్రీ కాండ్రేగుల రామచంద్రరావు (కాంగ్రెస్ పత్రిక సంపాదకుడు) డాక్టర్ సుబ్రహ్మణ్యంగారు, కాశీనాధుని నాగేశ్వర రావుగారు (ఆంధ్రపత్రిక సంపాదకులు), బ్రహ్మజ్యోస్యుల సీతా రామయ్య

పైవరుస : మామిడి లక్ష్మీపతిగారు, ధరణీప్రగడ శేషగిరిరావుగారు

కనుక 1925 సం॥రం జనవరినాటికి ఆశ్రిమంయొక్క గృహనిర్మాణ పథకమే మారిపోయింది. అవసరమయినకొద్దీ పాకలకు బదులు 12 పక్కా పెంకుటిండ్లను నలుచదరంగా వుండేఆవరణలో కట్టడానికి నిశ్చయింప బడింది. ఆప్రికారం 12 బంగళాలు సిద్ధం చేయబడ్డాయి.

సీతానగరం గ్రామం గోదావరిగట్టుకు ఆనుకొని ఉన్నప్పటికీ, వరద కాలంలో తప్ప గోదావరినీటికి మైలు మైలున్నర దూరంలో వుంటుంది. ఆశ్రమంలో ఉండేవారు మంచినీటికి నూరుగజాల దూరంలో ఉండేలంక ఊరు నూతికి పోవలసివచ్చేది. ఆశ్రమం ఆవరణలో మంచినీళ్ళనుయ్యి పడుతుందో పడదో అనే సంశయముండేది. పల్లెటి సత్యనారాయణ గారనే ఒక మిత్రుడు ఎంత ఖర్చైనా నూతిని త్రవ్వించడానికి సంసిద్ధుడైనాడు. ఆ రోజుల్లో దాదాపు 1500, 2 వేలు రూపాయలదాకా ఖర్చవుతుందని అంచనా వేయబడింది. శ్రీ పల్లెటి సత్యనారాయణగారి సోదరి ఆ సత్కార్యానికి పూనుకొంది. ఈశ్వరానుగ్రహంచేతను, సంకల్పించినవారి పుణ్యవిశేషం చేతను అయిదారు నిలువుల లోతుననే మంచి జలపడింది. దానిమీద మలచిన కారురాయి కట్టుతో పక్కానుయ్యి 1926 సం॥ వేసవికాలానికి తయారైంది.

ఈ విధంగా విశేష శ్రమలేకుండా ఆశ్రిమానికి భవనాలు, మంచినీటి సదుపాయమూ అమిరేయి.

ఆశ్రిమం కార్యక్రమాలు గాంధీజీ రూపొందించిన నిర్మాణ కార్యక్రిమాన్ని కొనసాగించడమే ముఖ్యలక్ష్యంగా, ఆశ్రిమంలో వివిధశాఖలు నెలకొలపబడ్డాయి.

ఆశ్రిమంలో ప్రధాన కార్యక్రమం ఖద్దరు, ఏకులు చేయడం మొదలు నూలు వడికించి నేయించడంవరకూ. ఖద్దరు వ్యాసంగం ఆశ్రమంలోనే జరుగుతూ వుండేది, కప్పడం, అంచులువేయడంలో ఆశ్రమం ప్రత్యేక కృషి చేయడం వలన సన్ననూలు నేసే పేటుమగ్గాలు ఆశ్రమం ఆవరణలోనే నెలకొల్పబడ్డాయి.

శ్రీ ధరణీప్రగడ శేషగిరిరావు ఆశ్రమం జనరల్ మేనేజరుగా వుంటూ, ఖద్దరుశాఖను కూడ పర్యవేక్షిస్తూ వుండేవారు. చండ్రుపట్ల హనుమంతరావు, జోస్యుల అప్పలరామమూర్తి, వోలేటి నరసింహం ప్రభృతులు ఖద్దరుశాఖలో వివిధ వ్యాసంగాలలో వుండేవారు. ఆశ్రమం జమాఖర్చులు వగైరాకు, ఆర్థిక వ్యవహారాలకు కీ. శే. మామిడి లక్ష్మీపతి అకౌంటెంట్ జనరల్. వీరందరి గురించి ముందుముందు వ్రాస్తాను.

పేదవారికి వుచితంగా వైద్యంచేసే నిమిత్తం వైద్యశాల యేర్పాటైంది. డాక్టర్ సుబ్రహ్మణ్యంగారే ఆ వైద్యాలయాన్ని నిర్వహిస్తూ వుండేవారు. ఆయనకు తోడుగా వైద్యపరీక్షలం దారితేరిన డాక్టరుండేవాడు. కాంపౌండరుగా అనుభవజ్ఞుడైన తేతలి సుబ్బారావుగారుండేవారు.

హిందీ భాషావ్యాప్తికి మాకు శ్రీ పీసపాటి సుబ్బారావుగారు లభ్యమైనారు. రాళ్ళకు రప్పలకు కూడా హిందీని నేర్పగలిగిన ఆయన చాకచక్యం చాల గొప్పది. అలాటి హిందీ ఉపాధ్యాయుడు మరొకడున్నాడా అనిపిస్తుంది. ఆయన పాఠ్యగ్రంథాన్ని చేత్తోపుచ్చుకుని పనిలో నిమగ్నులమై యున్న మావద్దకొచ్చి "జీ! అప్‌కా సేవామే మైఁ ఆయాహూఁ!" అని అనేసరికి ఎన్ని పనులున్నా వాటిని ప్రక్కకునెట్టి విధిగా పాఠాల్ని చదువవలసి వచ్చేది. ఆయన నేర్పేవిధానం కూడ చాల ఆశ్చర్యంగా వుండేది. కనుకనే నాబోటి వాళ్లు కూడ హిందీ నేర్చుకోవడం సంభవమైంది. ఎంతోమంది యువకులకు ఆయన ప్రత్యేకశిక్షణ నిచ్చాడు. అలాటివారిలో చాలమంది నేడు హిందీ పండితులుగా పనిచేస్తున్నారు.

డిప్యూటీ ఇనస్పెక్టర్ ఆఫ్ స్కూల్స్ పనికి రాజీనామా నిచ్చి ఉద్యమంలో జేరిన సుబ్రహ్మణ్యంగారి సోదరుడు శ్రీ సీతారామయ్యగారు ఆశ్రమంలో ఒక దేశీయ విద్యాలయాన్ని నిర్వహించేవారు.

మానాప్రగడ క్రిష్ణారావుగారు హరిజన కార్యక్రమాలను నిర్వహించేవారు.

ఆశ్రమంలో నివాసం వుండేవారేగాక, చుట్టుపక్కల గ్రామాలలోని పెద్దలు తీరిక కలిగినపుడల్లా ఆశ్రమానికి వచ్చి మంచిచెడ్డలు విచారించి పోతుండేవారు. స్వర్గీయులు నీరుకొండ వెంకటరత్నం, వెంకట సుబ్బన్న, ములగాడ రామన్న ప్రభృతులు, యింకా సజీవులుగానున్న కాండ్రు వీరన్న, పాటగంటి సూర్యనారాయణపంతులు, చెరుకూరి సూరన్న, కూచిపూడి వెంకట్రావు ప్రభృతులు ఈ శ్రేణికి చెందినవారే. నీరుకొండ వెంకటరత్నంగారి కుమారుడు వెంకట రామారావు (మాజీమంత్రి) ఆశ్రమంలోనే విద్యార్థిగా వుండేవారు.

రాజమహేంద్రవరం నుంచి ఆంధ్ర యువజన స్వరాజ్యసభ తరపున నడుపబడుతున్న కాంగ్రెస్ పత్రికను ఆశ్రమానికి అప్పజెప్పడానికి ఆశ్రమం తరపున మద్దూరి అన్నపూర్ణయ్య, నేను పనిచేయడానికి నిశ్చయించుకున్నాం

పల్లెటూరులో పత్రికను, ప్రెస్‌ను నడపడం అప్పట్లో ఒక ప్రయోగమే. కాంగ్రెస్ పత్రికకు ప్రెస్సాఫీసును నెలకొల్పడానికి అవసరమైన పరికరాలను విశ్వదాత దేశోద్ధారక శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు మేము కోరినంతనే విరాళమిచ్చారు. జర్మన్ ట్రెడిల్ టిప్‌టాప్‌ను మాకు కొనిపెట్టారు. దాదాపు రెండుమూడు వేల పౌనుల టైపులనుకూడ యిచ్చారు.

వాటితో 1925 సం॥ సెప్టెంబర్ నెలలో 'కాంగ్రెస్' పత్రికను సీతానగరంకు మార్చడం జరిగింది. మద్రాస్ నుంచి యిద్దరు నేర్పరులైన కంపోజిటర్లను పిలిపించుకున్నాం. అన్నపూర్ణయ్య సోదరుడు కృష్ణమూర్తి, వంగల సత్యనారాయణ అచ్చుకూర్చే పనినంతనూ బాగా నేర్చుకున్నారు. అన్నపూర్ణయ్య, నేను, రామచంద్రుని వెంకటప్ప పత్రికకు సంబంధించిన పనిని నిర్వహిస్తూ వుండేవాళ్ళం.

పత్రిక నచ్చువేయడమే కాకుండా స్థానికంగా లభ్యమయ్యే జాబ్ పనులను కూడా చేసేవాళ్ళం. శుభలేఖలు అచ్చు వేయించుకునేందుకు పల్లె

ప్రజలు రాజమహేంద్రవరం ప్రయాసపడి వెళ్ళనక్కరలేకుండా జాబ్ విభాగాన్ని యేర్పాటుచేశాం.

కొందరు హైస్కూలు ప్రధానోపాధ్యాయులు పరీక్షాపత్రాలను అచ్చువేసే పనిని మా కప్పచెప్పేవారు. ఆ పనిని చాల గోప్యంగా చేయవలసి యుండటంచేత మాకా పనిని అప్పచెప్పేవారు. మా కంపోజిటర్లందరూ ఆశ్రమంలో వుండేవారే కావడంచేత వాటి గోప్యత కెన్నడూ భంగం కలుగలేదు.

కాంగ్రెస్ పత్రికకు ప్రారంభంలో 600 మందికన్న చందాదారులుండేవారుకారు. అప్పటి కాలానికి అదే గొప్పగా వుండేది. చందాదారులు తక్కువైనప్పటికీ పాఠకు లెక్కువగా వుండేవారు.

1926 సం॥ నాటికి కాంగ్రెస్ రాజకీయాలదృష్టి శాసనసభలవైపునకు పోయింది. అప్పట్లో మాలక్ష్యం పూర్ణస్వరాజ్యం. అధినివేశరాజ్య ప్రతిపత్తి వంటి ఆశయాలు మాకు రుచించేవికావు. శాంతియుతమైన విప్లవమార్గాలను అన్వేషించడమే లక్ష్యంగా వుండేది. రాజకీయ హత్యలవంటి హింసావిధానాలు మాకు యిష్టంలేకపోయినా, నిష్కళంకమైన దేశభక్తి ప్రేరితులై, ఆ విధమైన హింసావిధానాలను అవలంభించిన విప్లవవీరుల త్యాగాన్ని మేము ప్రశంపించేవాళ్లం. అందుచేతనే 1926, 27, 28, 29 సం॥రాలలో కాంగ్రెస్ పత్రిక 1857 సం॥ నాటి ప్రధమ స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలోని ఘట్టాలను విపులంగా ప్రచురించింది. తాంతియాతోపే. మంగళ్‌పాండే, బహదూర్‌షా, రాణా కుమార్‌సింహ. నానాసాహేబ్, ఝాన్సీ లక్ష్మీభాయి, అజిజాన్ మొదలైన వీరులయొక్క, వీరవనితలయొక్క ఉజ్జ్వల గాధలను ప్రచురించింది. అందుచేతనే ఆనాటి కాంగ్రెస్ పత్రిక యువకులను ఎక్కువగా ఆకర్షించింది. ఆ కారణంగానే బ్రిటిష్‌పరిపాలకుల కన్నెర్రకుకూడ గురైంది.

1926 సం॥ లో జూలై నెలలో ఆషాఢ శుద్ధ చవితినాడు. 16వ తేదీ యని జ్ఞాపకం. రాజమహేంద్రవరంలో అల్లూరి సీతారామరాజు జయంతి జరిగిన సందర్భములో మా కాంగ్రెసుపత్రిక ప్రత్యేకసంచికను ప్రకటించింది.

ఆ సంచిక బయటికిరాకుండా చేయవలెనని పోలీసు వారెన్నో విధాలుగా తికమకలు పడ్డారు. సోదాకూడా జరిపించారు. ఆ సంచికలో అల్లూరి సీతారామరాజు చిన్ననాటి బొమ్మను, ప్రభుత్వం తాము చంపించినామని ప్రకటించిన బొమ్మను అచ్చువేశాము. ఆరెండు బొమ్మలు ఒకరివి కావని రుజువుచేసి శాస్త్రజ్ఞుల అభిప్రాయాలను ప్రకటించాము.

సీతారామరాజును గురించి గాంధీజీ అభిప్రాయాన్ని మేము అడుగగా ఆయన జీవితాన్నంతటిని తనకు వ్రాసిపంపమని గాంధీజి అడిగేరు. ఆ చరిత్రనంతా పంపి పత్రికకు 10 వ తేదీలోగా సందేశాన్ని పంపమని కోరేం. 14వ తేదీతో సంచిక అచ్చు పూర్తికావాలి. గాంధీజీ సందేశంకోసం ఒక పేజి ఖాళీగావుంచి 14వ తేదికి రాకపోతే కొంత నిస్పృహ చెందేము. 14వ తేది రాత్రి పోస్టులో గాంధీజీ ఒక పోస్టుకార్డుమీద స్వదస్తూరీతో తన సందేశాన్ని పంపారు. పోస్టుకార్డుమీద గాంధీజి సందేశాన్ని పంపుతారని మేము అనుకోని కారణాన మా నిస్పృహలో ఆకార్డును గమనించలేదు. రాత్రివేళ నిదానముగా పుత్తరాలను చూచుకొనేసరికి గాంధీజీ సందేశం కనుపించేసరికి మేమెంతో ఆనందావేశులైనాము, "Though we cannot agree with Sri Sitarama Raju's methods, we have to admire his patriotism, sacrifice and service" (మనం శ్రీ సీతారామరాజు పద్ధతులతో ఏకీభవించలేకపోయినా, ఆయన దేశభక్తినీ, త్యాగాన్ని, సేవాపరాయణత్వాన్ని ప్రశంసింపక తప్పదు.) అన్న ఆ సందేశాన్ని వెంటనే సంచికలో అచ్చువేసి రాత్రికిరాత్రి సంచికను రాజమహేంద్రవరం చేర్చేశాం.

గాంధీజీ సందేశాన్ని బ్లాకుచేయించి ఆ సంచికలో అచ్చువేయాలన్న మా సంకల్పం నెరవేరలేదు గాని, మరుసటి సంచికలో ఆ విధంగా ప్రకటించ గలిగేము.

1929 వ సం॥రం మేనెలలో గాంధీజీ ఆశ్రిమానికి రావడానికిముందు ప్రిథమ భారత స్వాతంత్ర్య దినోత్సవ వర్ధంతి (మే 10) సంచికను ప్రచు రించడానికి నిశ్చయించాము. ఆ సంచికలో మా సంపాదకులలో నొకడైన రామచంద్రుని వెంకటప్ప "చిచ్చులపిడుగు" అనే నాటికను వ్రాసాడు. 1857 సం॥రం మే నెలలో జరిగిన మంగళపాండే యొక్క వీరగాథను కథా వస్తువుగా తీసుకున్నాడు. అందలిమాటలు చాలవరకు మెడోస్ టైలర్ వ్రాసిన 'సీతా' అనే నవలలోనివే. కానీ, నాటకీయతలో కొంత తీవ్రత ప్రవేశించింది. ఆనాడు బ్రిటిష్ పాలకులమీద వుండే క్రోధం బాగా అందులో ప్రతిబిం బించింది. అయినప్పటికీ గాంధేయ ప్రభావంలో నున్న వెంకటప్ప ఆఖరున అహింసా ప్రబోధం చేసి శాంతిపాఠం వర్ణించాడు. కాని శ్రీ అన్నపూర్ణయ్య ఆ భాగం అనవసరమని తీసివేశాడు. అందులోవుండే చిక్కులు నేను చూపిం చినా ఆ ఆవేశంలో అతను వినిపించుకోలేదు. ఫర్వాలేదనుకున్నాడు. జైలుశిక్ష ప్రిమాదం కాదనుకున్నప్పుడు, ఆయన కావిధంగా స్ఫురించడంలో ఆశ్చర్యం లేదు. ఆ సంచిక అర్ధరాత్రి అచ్చు పూర్తికాగానే అందరం పత్రికలను మడిచిపెట్టి పోస్టులో వేయడానికి సంసిద్ధంచేస్తూండే సమయానికి, గాంధీజీ ఆగమన సందర్భంగా అప్పుడేవచ్చిన శ్రీ గొల్లపూడి సీతారామశాస్త్రి (స్వామీ సీతారాం) మాతోపాటు మడతలుపెడుతూ యథాలాపంగా ఆ నాటికను ఆసక్తితోచదివి చాల కలవరంచెందారు. ఆశ్రిమవాసుల రాజకీయ అభిప్రాయా లకు ఏవిధమైన నిర్బంధాలూ లేనికారణంచేత, కొందరు మా సంచికనుగురించి గాంధీజీతో చాడీలుచెప్పడం కూడా జరిగింది. గాంధీజీ వాటినంతగా పాటించ నట్లు, ఆయన మాయెడల చూపిన ఆదరణే నిదర్శనం. ఆ సంచిక ఫలితంగా శ్రీ అన్నపూర్ణయ్య జూలై నెలలో 124 వ సెక్షనుక్రింద అరెస్టు అయినాడు. రాజమండ్రి జాయింట్ మేజిస్ట్రేట్ కోర్టులో జిల్లాకలెక్టర్ శ్రీ బ్రౌన్ విచారణ చేశాడు. విచారణ నిమిత్తమాత్రమని, అతనికి దీర్ఘకాలపు శిక్ష పడుతుందనీ అందరూ అనుకున్నవిషయమే. అన్నపూర్ణయ్య అరెస్టుకాగానే ఆయనస్థానే నేను సంపాదకుడుగా వుంటానని డిక్లరేషన్ కొరకు జిల్లా మేజిస్ట్రేటుకు

దరఖాస్తు చేశాను. ఆ సందర్భంలో ఆయనను రాజమండ్రి ట్రావెలర్స్ బంగళాలో చూసాను. తేలికైన వాడుకభాషలో వ్రాయబడుతుండిన మా పత్రికను కలెక్టర్ బ్రౌన్ తెలుగు నేర్చుకోవడం కోసమైనా చదువుతుండేవాడు. అవివాహితుడిగా వుండిన బ్రౌన్‌కు పత్రిక చదువుతుండేటప్పుడు ఆగ్రహం కలిగి పళ్లు కొరుకుతుండేవాడని తాబేదారులు చెపుతుండేవారు. ఆ స్థితిగతులలో నేనాయన దర్శనం చేసాను. ఆయన చిచ్చులపిడుగు ప్రస్తావన తెచ్చాడు. అదెవరు వ్రాశారో చెప్పమన్నాడు. చెప్పడానికి వీలులేదని చెప్పేను. అలాగైతే నీకు డిక్లరేషన్ యివ్వనన్నాడు. 18 వ తేదీలోగా డిక్లరేషన్ నాపేర మారక పోతే అన్నపూర్ణయ్య పేరిటనే పత్రిక అచ్చు అవుతుందని చెప్పేను. "అదెట్లాగ? అన్నపూర్ణయ్య జైలులో వున్నాడు కదా!" అన్నాడు.

"ఈ వ్రాతలకు జవాబుదారీ ఆయన వహించినపుడు మీ అభ్యంతరమేముంది?"

"మీ దగ్గర ధరావత్తు అడుగుతాను" అన్నాడు బ్రౌన్.

"అడగడానికి చట్టమొప్పదు."

"ఎందుకొప్పదు?"

"పత్రికలనుండి ధరావతు తీసుకునే ప్రెస్‌చట్టం సవరింపబడిందికదా! రైటరానరబుల్ శ్రీనివాసశాస్త్రిగారు దానిని సవరింపచేశారా?"

"ఆ విషయమై నేను నా సలహాదారులతో సంప్రదించాలి."

"సంప్రదించండి. కానీ, 18 వ తేదీ వుదయానికి డిక్లరేషన్ రాకపోతే నేను పత్రికను ఆపను సుమండీ!"

"చిచ్చులపిడుగు ఎవరు వ్రాసారో చెబుతే మీ మిత్రుడికి కొంత సౌకర్యం కల్గుతుంది."

"నా మిత్రుడు అలాటి సౌకర్యాని కాసపడడం లేదండి."

"ఆలోచించుకోండి."

"శలవ్."

అన్నపూర్ణయ్యకు రిమాండ్ యిచ్చిన కొన్నిగంటలకు యీ సంభాషణ జరిగింది. నన్నుగురించిన పోలీసు భోగట్టా లాంఛనం జరిగింది. కోరుకొండ మకాంనుంచి 17 వ తేదీ మధ్యాహ్నం 12 గంటలవేళ, నన్ను కాకినాడలో మరునాడు 11 గంటలకు కలెక్టర్ యెదుట హాజరుకమ్మని ఒక సమను యివ్వబడింది. ఆ రోజులలో సీతానగరం నుండి రాజమహేంద్రవరం ప్రయాణం ప్రయాసతో కూడినపని. తెల్లవారేసరికి రాజమండ్రీ జేరి, మెయిల్‌లో కాకినాడచేరి కలెక్టర్ ఆఫీసుకు చేరేసరికి 11-30 గం. అయ్యింది. నేను వస్తే బంగళాకు తీసుకురమ్మని మేజిస్టీరియల్ క్లర్కుకు చెప్పి, బంగళాకు వెళ్లిపోయాడు. ఆప్రకారం నేను బంగళాకు వెళ్లాను. ఆయన కాఫీ యివ్వడం నేను స్వీకరించడం జరిగింది. సిగరెట్‌ను ముట్టిస్తూ నాకొకటి ఇవ్వబోయాడు. నాకు అలవాటు లేదనేసరికి "ఓః మీరు గాంధేయవాదులు కాబోలు" అని ఎకసెక్కమాడాడు. ఆ పిమ్మట మరల చిచ్చులపిడుగు ప్రస్తావన తెచ్చాడు. నా జవాబుకూడ మామూలే.

బ్రౌన్ : "మీకు తెలియదా ?"

నేను : "తెలుసును. కానీ చెప్పడం పత్రికాసంప్రదాయం కాదు."

బ్రౌన్ : ఆ భోగట్టావల్ల మీ స్నేహితుడికి లాభం కలిగితే !"

నేను : ఆ విధమైన భోగట్టా మీరు నన్నడగకూడదు. మీ కార్యాలయంలోని రహస్యాలను మీ శిరస్తాదార్ దగ్గర తెలుసుకోవడాన్ని మీరు హర్షిస్తారా ?"

బ్రౌన్ : "మీ వయస్సెంత ?"

నేను : "25 సంవత్సరాలు లోపు."

బ్రౌన్ : ఇంత చిన్నవయసులోనే మీరు పత్రికాసంపాదకులు కావడమేమిటి ? మా దేశంలో అలా జరగదు.

నేను : "పత్రికా సంపాదకత్వానికి వయస్సుతో నిమిత్త మేమి ? మీరు నాకన్న పెద్దవారు. క్షమించండి: మీ వయస్సెంత ?"

బ్రౌన్ : "35 సంవత్సరములు దాదాపు."

నేను : "తమరెపుడు ఐ. సి. యస్. లో చేరినారు ?"

బ్రౌన్ : "నేను 23 వ యేట చేరినాను."

నేను : "తామంత చిన్నవయస్సులోనే పరదేశంలో సబ్ కలెక్టరుగా కొన్నిలక్షల జనానికి పరిపాలకులైనపుడు, 35 సం॥ లకే గోదావరిజిల్లావంటి పెద్దజిల్లాకు అధిపతులైనపుడు, నేను 25 యేండ్ల వయస్సులో నాదేశస్థులకు నా భాషలో సలహా చెప్పడానికి అర్హుడను కానా ?"

బ్రౌన్ : "నీవు చాల యుక్తిపరుడులా గున్నావే !"

నేను : "వాస్తవాన్ని యుక్తి అంటే నేను చెప్పలేను"

బ్రౌన్ : "సరే: డిక్లరేషన్ మీద సంతకం చేయండి"

డిక్లరేషన్ మీద సంతకం చేసాను. కలెక్టర్ నాకు హితవుచెప్పడం ప్రారంభించాడు. అన్నపూర్ణయ్య కఠినశిక్ష పాలవుతాడని, నేనైనా జాగ్రత్తగా వుండాలని దాని సారాంశం. బ్రిటిష్‌పరిపాలన ప్రస్తావనవచ్చి, ఆయన పూర్ణస్వాతంత్ర్యాన్నిగురించి తేలిగ్గా మాట్లాడినప్పుడు నేను కొంచెం తీవ్రంగా మాట్లాడవలసి వచ్చింది. దఫేదారు ప్రవేశంతో స్థితిగతులు ఉపశమించాయి. మరొక్క హితోపదేశంతో నేను బయటకు వచ్చేను.

ఆ పిమ్మట అన్నపూర్ణయ్య విచారణ కలెక్టర్ బ్రౌన్ యెదుట రాజమండ్రిలో జరిగింది. ఆయనకు 2½ సం॥లు శిక్ష విధింపబడింది. పత్రిక యథాప్రకారంగా నడిచింది. ముందుముందు దాని చరిత్రను వివరంగావ్రాస్తాను.

1929 సం॥రం మే 9, 10 తేదీలలో గాంధీజీ మా ఆశ్రమానికి వచ్చి ఆ నేలను పునీతం చేసిన విషయం లోగడ సూచించాను.

1928 సం॥రం డిసెంబర్ నెలలో కలకత్తాలో మోతీలాల్‌నెహ్రూ అధ్యక్షతన జరిగిన కాంగ్రెస్ మహాసభలలో కాంగ్రెస్ లక్ష్యం, పూర్ణ స్వాతంత్ర్యంగా నిర్వచించబడాలని జవహర్, సుభాష్‌ల నాయకత్వాన తీవ్రమైన ఆందోళన సాగించారు. కాంగ్రెస్ రెండుగా చీలిపోయేటంతదాకా ఆ

వివాదం సాగింది. గాంధీజీ ఆ స్థితిని తప్పించారు. 1929 వ సంవత్సరం డిసెంబర్ 31 వ తేదీవరకు తాను బ్రిటిష్ వారిచ్చే అధినివేశ స్వాతంత్ర్యం కోసం వేచివుంటానని, అలోగా బ్రిటిష్‌వారు అందు కంగీకరించకపోతే తాను కూడ పూర్ణ స్వరాజ్యవాది నైపోతానని ప్రకటన చేశారు. ఈలోగా దరిద్ర నారాయణ సేవలో ఖద్దరు కార్యక్రమం కొనసాగిస్తానన్నారు.

ఆ పనిలో ఆయన ఆంధ్రదేశమంతటా సంచారం చేశారు. ఆ సంచారంలో ఆయన మే 9, 10 తేదీలలో మా ఆశ్రమంలో విశ్రాంతి తీసుకుని, 10 వ తేదీని వెళ్ళిపోయారు.

## ఆ తి థ్య పు యే ర్పా ట్లు

మేనెల చాల వేడికాలం. సీతానగరం ప్రాంతం ధనవంతమైనప్రాంతం కాదు. ప్రజలు ఉత్సాహవంతులే గాని అప్పట్లో ధనవంతులు కారు. అయినప్పటికి, ఆయన వచ్చేదారిలో వున్న వూళ్ళవారు తమ శక్తికి మించి విరాళాలను పోగుచేసి ఆయనకు సమర్పించారు. ఎక్కడికక్కడే చలువపందిళ్లు వేసి ఆయనకు హార్దికమైన స్వాగతాన్నిచ్చారు. ఆశ్రమం ఆవరణలో ఆయన కొరకు ప్రత్యేకంగా ఒక కుటీరాన్ని నిర్మించారు. ఆ కుటీరం కప్పు కొత్త తాటాకులతో ఏర్పాటు కాబడింది. దాని కాచ్ఛాదంగా క్రొత్త తాటాకులతో పెద్ద పందిరి వేయబడింది. కుటీరంచుట్టూ వట్టివేళ్ళతడికలు అమర్చబడినాయి. ఎయిర్‌కండిషన్ లేని ఆ రోజులలో మా కతిథిగా వచ్చిన మహాపురుషుని శరీరానికి యేవిధమైన శ్రమా కలుగకుండా చేయవలసిన యేర్పాట్లన్నీ చేశాం.

ఆయనతోబాటు దేశభక్త కొండా వెంకటప్పయ్య, ప్రైవేటు కార్యదర్శి శ్రీ ప్యారీలాల్, కస్తూర్బా, శ్రీమతి దుర్గాబాయ్, జయప్రకాశ్ నారాయణ్ సతీమణియైన శ్రీమతి ప్రభావతి, ఇమాంసాహెబ్ మొదలైన వారున్నారు. జిల్లాలోని ప్రముఖులందరూ, రాష్ట్రంలోని నిర్మాణ కార్యకర్తలు కూడ ఆయనవెంట వచ్చారు.

వీరందరికీ భోజన మజ్జనాది వసతులన్నీ శ్రీ శేషగిరిరావు పర్యవేక్షణలో సంతృప్తికరంగా జరిగేయి. చుట్టుప్రక్కల గ్రామాలనుండి 50, 60 వేల జనం వచ్చారు. అందరికి లోటనేది లేకుండా భోజనాది సౌకర్యాలు అమర్చబడినాయి. అవి యెల్లాజరిగేయో యిప్పుడు తలుచుకుంటే ఆశ్చర్యంగా వుంటుంది. ప్రజలే అందుకు తగిన యేర్పాట్లనూ, సంబారాలను సమకూర్చుకున్నారు. ఆ రోజుల్లో యే సందర్భంలోనైనా కొన్నివేలమందికి భోజనాలు యేర్పాటుచేయడమంటే మాకంత కష్టంగా తోచేదికాదు. ప్రజలయొక్క అపారమైన ప్రేమ, తోడ్పాటు వుండడంవల్ల ఆ భరద్వాజశక్తి మా ఆశ్రమానికి వుండేది. కబురు అక్కరలేకుండానే ప్రశస్తమైన భోజనసామగ్రి వచ్చిపడేది.

అప్పట్లో గాంధీజీ శ్రీ బొల్లాప్రగడ సుందర గోపాలరావుగారి సలహామీద అపక్వాహార ప్రయోగాన్ని చేస్తూండేవారు. మొక్కగోధుమలు, పెసలు లేత తోటకూర, నారింజరసం, మేకపాలు, వేరుసెనగగింజలు, తేనె ఇత్యాది వస్తువులతో భోజనం వుండేది. ఆ యేర్పాట్లన్నీ "బా" స్వయంగా చూసుకునేది. ఆవిడ కోరినవస్తువులు సమకూర్చడమే మా పని. ఆయన ఆవిధంగా భోజనం చేస్తున్నా పరివారం యొక్క అవసరాలను గాంధీజీ గుర్తించనంతగా ఎవ్వరూ గుర్తించరనే చెప్పాలి.

మా ఆశ్రమంలో కాఫీ త్రాగేవారు కొందరుండేవారు. కానీ సాధారణంగా గాంధీజీ పరివారంలో కాఫీ, టీలు కావలసినవారు వుంటారని తెలియదు కదా! గాంధీజీకి దక్షిణాఫ్రికాలో సహచరుడుగా నుండిన ఇమాం సాహెబ్‌కు ప్రొద్దున్నే కాఫీ కావాలి. 'బా'కు కూడ అలవాటుంది. గాంధీజీ ఆశ్రమంలో ప్రవేశించడంతోనే, శేషగిరిరావుతో "ఇమాం సాహెబ్‌కు కాఫీ యేర్పాటుచేశావా ? 'బా'కు కూడా!" అని మాట అందించారు. వారితో కూడా వుండే సుబ్బయ్య వగైరా అరవమిత్రులకి ప్రశస్తమైన కాఫీ అందజేయబడిందని వేరే చెప్పనక్కరలేదు.

గాంధీజీ ఆశ్రమంలో విశ్రాంతి తీసుకున్న రోజున కొన్ని వేలమంది ఆయన దర్శనం చేశారు. ఆ సాయంకాలమో, మరునాడు వుదయమో ఆయన వంగలపూడిదాకా వెళ్ళి ప్రజలిచ్చిన ఖద్దరు నిధి నందుకున్నారు. మొత్తం 6 వేల రూపాయల నిధి, బంగారు నగలూ ఆయన కాప్రాంతంలో సమర్పింపబడ్డాయి. ప్రజల వుత్సాహానికి నిర్మాణ కార్యక్రమ ఆసక్తికి ఆయన సంతృప్తులైనారు.

గాంధీజీకి ఆశ్రమం తరపున మా కార్యక్రమాన్ని, మా లక్ష్యాన్ని, మా జీవితవిధానాలను విశదీకరిస్తూ ఒక నివేదికను తయారుచేసి, ఆయన రాగానే సమర్పించాం.

నిర్మాణకార్యక్రమ నిర్వహణలో పై పటాటోపం అంతగా కనబడదు కనుక మేము నిర్వహించే కార్యక్రమాలను గురించి కొందరు గాంధీజీకి చాడీలు చెప్పడం జరిగింది. వాటిని గురించి తలపెట్టడంకూడా అనవసరం.

అప్పట్లో కొందరికి మా కలిసికట్టుదనానికి, సాహసానికి కొంత అసూయ వుండేది. మా భోజన మజ్జనాది సౌకర్యాలకుకూడ ఈర్ష్యపడినవా రున్నారు. మా పేదరికాన్ని లోకానికి ప్రకటించని భేషజంపట్లకూడా అసూయ వుండేది. ఆశ్రమం అంటే రాజకీయ కార్యక్రమాలను, నిర్మాణ కార్యక్రమా లనూ నిర్వహించే ఆశ్రమంగానే మేము భావించేము. కాని బ్రహ్మచర్యం, తపస్సు, ఆత్మసాధన యిత్యాది లక్ష్యాలతో మేము ఆ కార్యక్రమానికి పూనుకోలేదు. మేము చేసే పనులబట్టి కాకుండా మేము వహించవలసిన కుటుంబభారాలనుబట్టి మా భృతిని నిర్ణయించుకున్నాం. వ్యక్తిగతమైన ఆస్తి పాస్తులను విసర్జించలేదు. ఇవన్నీ ఆశ్రమభావానికి విరుద్ధ మనుకునేవారు మమ్మల్ని విమర్శించేవారు.

కనుక గాంధీజీ ఆశ్రమానికి వచ్చినపుడు, మా స్థితిగతులను యెంత మాత్రము దాచకుండా ఆయనయెదుట పెడుతూ మా నివేదికను సమర్పించాము. దాదాపు 20 పైపుపేజీలుగల ఆ నివేదికను గాంధీజీ బాత్‌రూంలోకి

తీసుకెళ్లారు. దాని నక్కడ జాగ్రత్తగా చదివి చాలాచోట్ల గీతలు పెట్టారు. ఆయన సత్యాగ్రహ ప్రమాణాలకు మే మంద మేమో నని సంకోచపడిన విష యాలలో, ఆయన మా ప్రమాణాలనే అంగీకరించారు. ముఖ్యంగా బ్రహ్మ చర్యం విషయంలో ఆయన సామాన్య గార్హస్థ్యజీవనమే వుత్తమ మన్నారు.

ఈ సందర్భంలో ఒక విశేషాన్ని చెప్పాలి. ఆశ్రమానికి రాకపూర్వం సుబ్రహ్మణ్యంగారికి సంతానం లేదు అన్నపూర్ణయ్య వగైరాలకు కూడా సంతానం కలుగలేదు. 1927 సం॥లో అందరూ సంతానవంతులైనారు. కళా వెంకట్రావు కుటుంబంతో సహా కొంతకాలముండి సుబ్రహ్మణ్యం గారిచేత వైద్యం చేయించుకున్నాడు. ఆ పిమ్మటనే అతనికొక మగశిశువు కలిగాడు. ఆ శిశువు కొద్దిరోజులు మాత్రమే జీవించాడు. మొసలికంటి తిరుమలరావు దంపతులు కూడా ఆశ్రమంలో కొన్నిరోజులున్న తర్వాతనే వారికి సంతానం కలిగింది. అందుచేతనే కాశేశ్వరరావుగారిని కూడా కొంతకాల మక్కడుంచి అచ్చటి వాతావరణాన్ని పరిశీలించాలని పరిహాసంగా అనుకునేవాళ్ళం.

నియమబద్ధమైన గార్హస్థ్యజీవితం, ఆచరించలేని బ్రహ్మచర్యం కన్న వుత్తమమని ఆయన చెప్పేడు. సబర్మతీ ఆశ్రమంలో ఈ నియమాన్ని అప్రియత్నంగా ఎప్పటికప్పుడు నాలుక కరచుకొన్నవారితో ఆయన పొందిన అనుభవం మాకొకవిధంగా ఉపకరించిం దనుకుంటాను.

ఆశ్రమ భృతిని నిర్ణయించడంలో వారి కుటుంబ బాధ్యతలే ప్రధా నంగా పరిగణించబడినాయని మేము వ్రాసినపుడు ఆయన సంతోషంతో బాగున్నదన్నారు. మిషనరీల విధాన మదేనని అన్నారు. సుబ్రహ్మణ్యం గారికి నెలకు 50 రూపాయలు. అన్నపూర్ణయ్య కుటుంబానికి 49 రూపాయలు, నా కుటుంబానికి 35 రూపాయలు మాత్రమే భృతి. వైద్యశాలలో కాంపౌం డర్‌గా వుండేవారికి 25 రూ॥లు భృతి అయితే, సుబ్రహ్మణంగారికి 50 రూ॥లు మాత్రమే. అదొక ప్రత్యక్ష సామ్యవాద ప్రయోగంగా సాగిపోయింది.

దాదాపు 2, 3 లక్షల రూపాయల ఖద్దరు వుత్పత్తి విక్రియాలు సాగించిన ఖద్దరు శాఖ సిబ్బందికి సాలుకి 4, 5 వేల రూ॥ల కన్న ఎక్కువ ఖర్చు కానందున, మా దినచర్యలో వృధా వ్యయం జరుగలేదని ఆయన సంతృప్తిపడ్డారు. మొత్తంమీద మా నివేదిక ఆయనను సంతృప్తిపరిచింది. మరుసటివారం 'యంగిండియా' పత్రికలో ఆశ్రమనివేదిక నంతనూ ప్రచురించి దానిని గురించి ప్రశంసాపూర్వకమైన వ్యాఖ్యానాన్ని కూడా ఆయన వ్రాశారు.

గాంధీజీ మే నెలలో 10 వ తేదీ అనగా మరుసటిరోజు ఉదయం ఆశ్రమంలోని వివిధ కార్యకలాపాలను సందర్శించారు. ఖద్దరు శాఖను, గ్రంధాలయాన్ని, వైద్యాలయాన్ని హిందీ విద్యాలయాన్ని, కాంగ్రెస్‌పత్రిక కార్యాలయాన్ని చూచి అచట పనిచేస్తూండేవారిని ఛలోక్తులతో ఉత్సాహపరిచారు. ఆ సందర్భంలోనే కాంగ్రెస్ పత్రిక కార్యాలయానికి వచ్చినపుడు అన్నపూర్ణయ్య, వెంకటప్ప, నేను, మా సిబ్బంది స్వాగతమిచ్చాం. మేమంతా చాపలమీద వ్రాతబల్లలముందు కూర్చుని పనిచేసుకోవడం ఆయనకు ఆశ్చర్యము కలిగించింది. కుర్చీలు, బల్లలు లేకుండానే పత్రికను నిర్వహిస్తున్నారా అని అడిగారు. అలాగే సాగిపోతోందని మేము చెప్పేసరికి నవ్వుతూ "యీ సంగతి నేను స్వామీ ఆనంద్‌కు చెప్పాలి" అని చమత్కరించారు. (స్వామీ ఆనంద్ 'నవజీవన్' ప్రెస్ మేనేజరు.)

ఆ రోజంతా గాంధీజీ ముందర అనేక సమావేశాలు జరిగాయి. ఖద్దరు కార్యక్రమంలో, తదితర కార్యక్రమంలో పనిచేసే వారెంతోమంది అప్పట్లో ఆంధ్ర ఖద్దరుశాఖకు అధిపతులుగా వుండే దేశభక్తునిమీదా, సీతారామశాస్త్రి గారిమీదా చాలా గుర్రదగోళం రేగిన ఘట్టం మాత్రం జ్ఞాపకముంది. సాధారణంగా వివాద విషయాల్లో కలుగజేసుకోని సుబ్రహ్మణ్యంగారు కూడా తీవ్రరూపం దాల్చారు. ఆయనను బాగా ప్రేరేపించినవారు పట్టాభిగారు. మొత్తంమీద ఆ వివాదం ఫలితంగానే ఆంధ్రలో ఖద్దరుశాఖ- పట్టాభి, వేమూరి నారాయణమూర్తిగార్ల పరమైంది.

ఆ సందర్భంలోనే గాంధీజీ దగ్గరకు కొందరు యువకులువచ్చి ఆయనతో రాజకీయ పోరాటంలో హింస- అహింస అనే విషయాన్ని గూర్చి చాలా తీవ్రమైన చర్చలు జరిపారు. అందులో అన్నపూర్ణయ్య, పందిరి మల్లికార్జునరావు వున్నారు. ఆ చర్చల పర్యవసానంలో విశేష మంతగాలేదు కానీ మహాత్ముని ఓర్మి మాత్రం అద్భుత మనిపించింది. ముప్ఫైయేండ్లు నిండకుండా, పదేళ్ళ లోకానుభవమైనా లేనివారు నిర్భయంగా ఆయనను ప్రశ్నిస్తుంటే, ఆయనేమీ ఆగ్రహపడకుండా వారికి నచ్చచెప్పడమే గొప్ప సంగతి. వారావేశంతో చెపుతున్న మాటలను శాంతంగా తలదాల్చారు.

మా ఆశ్రమంలో సుమారుగా పాడి వుండేది.

ఆశ్రమం తాలూకు భూమి అంత సారవంతమైనది కాకపోయినా, కొద్దిపాటి నీటిసౌకర్యంతో కూరగాయలు వగైరా పండించేవాళ్లు. అంటు మామిడి వగైరా మొక్కలు కూడా వుండేవి.

వ్యవసాయానికి కావలసిన ఎడ్లు వుండేవి. బండినిమిత్తం చక్కని ఒంగోలుజాతి ఎడ్లజత వుండేది. వాటి పోషణలో మేము లోభించని కారణం చేత ఆ ఎడ్లజత చూడ ముచ్చటగా వుండేది.

మహాత్మాజీ తెల్లవారగట్లలేచి, చరచర నడిచి మా దూడలపాకలోకి వెళ్లేడు. ఆ సంగతి తెలుసుకుని డా॥ సుబ్రహ్మణ్యంగారు ఆయనను కలుసుకున్నారు. గాంధీజీ ఆయనను చూడడంతోనే "సుబ్రహ్మణ్యం! మీ పశువులు బాగానే వున్నాయి" అని పలకరించి మకాంకు వెళ్ళిపోయారు.

గ్రామాల పారిశుధ్యం విషయంలో గాంధీజీ చాల శ్రద్ధవహించేవారు. ఆశ్రమంనుండి వంగలపూడి గ్రామానికి పుంతలోనుండి కారు వెడుతోంది. పుంతలో దూరంగా ఒకవ్యక్తి విశ్రాంతిగా బహిర్దేశానికి కూర్చున్నాడు. కాంపోజిషన్ దిద్దే ఉపాధ్యాయుని దృష్టి వ్యాకరణదోషం మీదికే వెళ్ళినట్లు గాంధీజీ ఆ వ్యక్తిని చూడడం జరిగింది. వెంటనే "సుబ్రహ్మణ్యం! యీ దురాచారాన్ని మాన్పలేవా?" అన్నారు. డాక్టర్‌గారు ఏమీ సమాధానం యివ్వ

లేకపోయారు. అలాంటి ప్రయత్నాలు పరిగినా అవి ఫలప్రదమైనాయనడానికి వీలులేదు. పల్లెలలోను, పట్టణాలలోను రోడ్డుప్రక్కన, రైలుకట్ట ప్రక్కన అశౌచం చేయడానికి చిన్నప్పటినుండీ అలవాటుపడ్డ జనంయొక్క దురలవాటును మాన్పించడం అంత సులభమా ?

11 వ తేదీ వుదయం గాంధీజీ ఆశ్రమంనుండి పశ్చిమగోదావరిజిల్లాకో, నెల్లూరుకో ప్రయాణం. ముందు నిర్ణయింపబడిన కార్యక్రమం ప్రకారం ఆయన కారులోనే రాజమహేంద్రవరం చేరవలసినది కాని గోదావరిమీద ఆయన ప్రయాణం చేయగోరినందున లాంచి యేర్పాటు చేయడమైంది. లాంచిదాకా లంకలోనుండి నడువవలసిన కారణంచేత ఆయన దృష్టి నాకర్షించిన మా ఎడ్లబండిమీద ప్రయాణం చేశారు.

ఆశ్రమంనుండి వెళ్ళిపోయేటప్పుడు ఆశ్రమవాసులంతా ఆయనవద్ద శలవు తీసుకున్నారు. ఆయన మా ఆతిధ్యపు ఏర్పాట్లతో సంతృప్తు డయినట్లు శ్రీ వెంకటప్పయ్యగారితో యిలా అన్నారు : "దేశభక్తాజీ! నా కిక్కడ మరి రెండురోజులు విశ్రాంతి నివ్వకూడదా" అని చమత్కరించారు.

1933 సం॥ డిసెంబర్‌లో గాంధీ ఆంధ్రదేశ యాత్రలోకూడ విశ్రాంతి మా ఆశ్రమంలోనే యేర్పాటుచేయడమైంది. మరుసటివారం 'యంగ్ఇండియా' పత్రికలో మేము గాంధీజీకి సమర్పించిన ఆశ్రమ నివేదిక పూర్తిగా ప్రకటింపబడింది. దానిమీద గాంధీజీ ప్రశంసాయుతమైన చిన్న వ్యాఖ్యానాన్ని ప్రకటించారు. "No where in my extensive tour have seen sude life, spirit and enthusiasm as I find in these surrounding villages" ఈ పరిసర ప్రాంతాల్లో గోచరమయ్యే జీవశక్తి ఉత్సాహం, ఉద్వేగం, నేను నా విస్తృత పంచారంలో మరెక్కడా చూడ లేదు. అని కూడ ఒక చిన్న సందేశాన్నిచ్చారు. అప్పటినుంచి మా ఆశ్రమం మహాత్మాజీ యొక్క ఆప్యాయతను చూరగొన్నది.

గాంధీజీ ఆంధ్రదేశయాత్ర ముగిసినపిమ్మట, ఆంధ్రదేశంలో వసూలైన ఖద్దరునిధి నుండి అఖిలభారత చరఖాసంఘం వారిద్వారా ఖద్దరు ఉత్పత్తికి మాకు 25 వేల రూపాయలు ఋణం యివ్వబడింది. అంతవరకూ మా ఆశ్రమానికి ఏవిధమైన నిబంధనలుగాని, డాక్యుమెంట్సుగాని లేవు. ఋణం పుచ్చుకోవలసి వచ్చింది కనుక ఆశ్రమానికొక జనరల్ బాడీ, ట్రస్టు వగైరాలు యేర్పాటుచేయవలసి వచ్చింది. జూలై నెలలో జిల్లా రిజిస్ట్రారు కార్యాలయంలో సొసైటీస్ రిజిస్ట్రేషన్ ఏక్ట్ క్రింద సభ్యులైనవారమంతా సంతకాలు చేసి రిజిష్టర్ చేయించాము. శ్రీ సాంబమూర్తిగారి అధ్యక్షతక్రింద ఒక ట్రస్టుబోర్డును కూడ యేర్పాటుచేయడం జరిగింది. సభ్యులందరూ హామీ పత్రాలమీద సంతకాలుచేసి ఆ ఋణాన్ని తెచ్చాం.

దానితో స్థానికంగా వడుకుపరిశ్రమను వృద్ధిచేశాం. పేటుమగ్గాలను (కుప్పడం వగైరా అంచులు) నెలకొల్పాం. పిఠాపురం దగ్గర నాగులాపల్లి గ్రామం పరిసరాల్లో సన్నని సాఫీయైన కోరానూలు తయారవుతుంది. నాగులాపల్లి, రమణక్కపేట మొదలైన గ్రామాలలో ఆ నూలును చక్కగా చిక్కగా నేయగలిగిన నేతగాళ్లుండేవారు. మా ఆశ్రమం సెంటర్లో తయారైన కోటింగ్ గుడ్డకు అఖిలభారత ఖాదీప్రదర్శనలో బంగారుపతకాలు లభించాయి. వాటితో తయారుచేసిన సూట్లు, పట్టుగుడ్డతో తయారుచేసినట్లుండేవి. అందుచేత దానికి అపారమైన గిరాకీ వుండేది. ఆ ప్రాంతాల్లో గాంధీజీ సంచారం చేసినపుడు, నాగులాపల్లి గ్రామంలో రాత్రివేళ ఒక చిన్న గుడ్డిదీపంముందు పదిమంది స్త్రీలు కూర్చుని, ఊసూ పలుకూ ఆడుకుంటూ రాట్నాలు వడకటం చూసారు. వారు తీసిననూలు సాఫీతనానికి ఆయన చాల ఆశ్చర్యపడ్డారు, తర్వాత 'యంగ్ఇండియా' పత్రికలో నూలు వడికే క్లబ్బులని చక్కని వ్యాఖ్యానం వ్రాశారు. ఈ కేంద్రం వలన మా ఖద్దరు పరిశ్రమ లాభదాయకం కావడమే కాకుండా, ఖద్దరు పరిశ్రమకు ప్రతిష్టను యినుమడింప చేసింది.

1927-29 సం॥ నాటికి అనగా స్థాపింపబడిన రెండు సంవత్సరాలలో ఆశ్రమం నిర్వహిస్తున్న పనులను, దినకృత్యాలనూ కొద్దిగా వివరిస్తాను :

వ్యక్తిగతమైన ఆడంబర నియమాలకు మేము ఎన్నడూ ప్రాధాన్యత నీయలేదు. ఉదయము ఆరు గంటలవరకూ ఎవరి వీలునుబట్టి వారు తమ స్వంతపనులను చూచుకొనేవారు. ఆరు గంటలకు గంటకొట్టేసరికి అందరూ జండా స్తంభందగ్గర చేరేవాళ్ళం. ఆ గంటకొట్టే బాధ్యత హిందీ అధ్యాపకులైన పీసపాటి సుబ్బారావు గారిది. హోరున వర్షం కురుస్తున్నా తనకు 105 డిగ్రీలు జ్వరమున్నా ఆయనెన్నడూ కాలాతిక్రమణం చేయలేదు. జండాదగ్గర సమావేశమైనవారు "ఝండా ఊంఛా రహే హమారా" అనే గీతాన్ని పాడి వందనం చేసేవాళ్ళం. "ఆంధ్రమాత శ్రీసమేత అనుపమ ప్రపూత చరిత" అనే మంగళ గీతాన్ని పాడి వందనం చేసేవాళ్ళం.

తర్వాత గ్రంథాలయ భవనంలో చేరి 7 గం॥ వరకూ యథాశక్తిగా నూలు తీసేవాళ్ళం. ఆ సమయంలోనే రాజకీయ, సాంఘిక, పౌరాణిక చర్చలన్నీ ధారాళంగా సాగేవి. అనంతరం ఎవరిపనులలోకి వారు వెళ్ళిపోయేవారు. ఊళ్ళోవుంటే సుబ్రహ్మణ్యంగారూ, తేతలి సుబ్బారావు, సరస్వతుల సూర్యనారాయణగారూ ఆస్పత్రిపనిలోకి వెళ్ళేవారు.

ప్రెస్‌లో పనిచేసే అన్నపూర్ణయ్య, నేను, వెంకటప్ప, వంగల సత్య నారాయణ, మద్దూరి కృష్ణమూర్తి, మాతోవుండే కంపోజిటర్లు ప్రెస్‌పనిలోకి వెళ్ళేవారం.

వోలేటి నరసింహం, మామిడి లక్ష్మీపతి, చందుపట్ల హనుమంతరావు, జోస్యుల అప్పలరామమూర్తి, పె. గోపాలకృష్ణమూర్తి ప్రభృతులు ఖద్దరుపనిలోకి వెళ్ళేవారు.

డాక్టర్ సుబ్రహ్మణంగారి అన్నగారైన సీతారామయ్యగారు విద్యాలయానికి వెళ్ళేవారు. హిందీ మాష్టరుగారు బయటనుండివచ్చి చదువుకొనే వారికి పాఠాలు చెపుతూ మధ్య మధ్య అస్మదాదులైన మా దగ్గరకే వచ్చి పాఠాలుచెప్పి పోతుండేవారు. ఆశ్రమానికి జనరల్ మేనేజరుగా వుంటూ, నిర్మాణములను, తోటా, దొడ్డీ వగైరాలను చూచుకుంటూవుండేవాడు ధరణీ

ప్రగడ శేషగిరిరావు. ఈ విధంగా ఏ నిర్బంధములూ లేకుండా యెవరిపనులు వారు చక్కపెట్టుకునేవారు.

1930 సం॥ వరకూ ఆశ్రమంలో వంటలు, భోజనాలు ఎవరివి వారే చక్కబెట్టుకునేవారు. ముఖ్యమైన సామగ్రులను మాత్రం ఆశ్రమం సప్లయి చేసేది.

సాయంకాలం 5 గంటల అనంతరం- వేసవికాలమైతే 6 గంటల అనంతరం అందరం చెడుగుడు, ఉప్పుపట్టీ వగైరా ఆటలు ఆడేవాళ్ళం. చీకటి పడ్డాక కాలకృత్యాలు తీర్చుకొని, స్నానాలు చేసేటప్పటికి పోస్టువచ్చేది. పత్రికలను చదువుకొని భోజనాలు చేసేసరికి 9 గంటలకు మరల హిందీ మాస్టర్‌గారు గంట కొట్టేవారు. అందరూ జండాదగ్గరకు వచ్చి, వందనంచేసి, ఎవరి యిండ్లకు వారు పోవడం జరిగేది.

తరుచుగా నూతిదగ్గరుండే యిసుకగుట్టలను రాజకీయ చర్చావేదికగా వుపయోగించడంకూడా జరిగేది. ఇది మా దినచర్య. దీనికిమించి రాజకీయంగా, సాంఘికంగా, సాహిత్యపరంగా ఎవరి వ్యాసంగాలు వారికుండేవి. తరుచు జరుగుతూవుండే గోష్ఠులలో వారివారి వికాసం వెల్లడవుతుండేది.

ఆశ్రమంలో వుండే సభ్యులందరూ రాజకీయంగా ఏకాభిప్రాయులు కారు. 1926 సం॥ వరకూ అందరూ గాంధీజీ రాజకీయాలకు సన్నిహితులు. 'నో ఛేంజి' వర్గంలోని వారనే చెప్పాలి. కాంగ్రెస్ శాసనసభా కార్యక్రమం ద్వారా స్వరాజ్యాన్ని సాధిస్తుందనే విశ్వాసం ఎవ్వరికీ వుండేదికాదు. కానీ గాంధీజీ కాన్పూరు కాంగ్రెస్‌లో శాసనసభా కార్యక్రమానికి ఆమోదముద్ర వేయడంచేత, అందరూ యథాశక్తిగా యీ కార్యక్రమానికి తోడ్పడేవాళ్ళం.

డాక్టర్ సుబ్రహ్మణ్యంగారు శాసనసభా కార్యక్రమంలో అసలెన్నడూ జోక్యం కల్గించుకోనేలేదు. పత్రికానిర్వహణం కారణంగా మేము తప్పని సరిగా ఆ కార్యక్రమాల్లో పాల్గొనేవాళ్లం. శాసనసభలలో ప్రవేశించి ప్రతిపక్షములో వుండి ప్రతిష్టంభనలు సాగిస్తామనే చిత్తరంజన్‌దాస్, మోతీలాల్

గార్ల స్వరాజ్యపార్టీ మమ్మల్ని ఆకర్షించలేదు. శాసనసభల్లో ప్రవేశించినపుడు మాంటిఫర్డు సంస్కరణలో ఎంత అధికారముంటే అంత అధికారాన్ని స్వీకరించాలని మహారాష్ట్రుల రెస్పాన్సివ్ కోఆపరేషన్ వాదాన్ని మేము స్థూలంగా బలపర్చేవాళ్ళం.

ఆ విషయంలో సుబ్రహ్మణ్యంగారికీ, పత్రికావర్గం వారికీ ఏకాభిప్రాయం వుండేదికాదు. కానీ ఆయనెప్పుడూ మా స్వేచ్ఛకు అడ్డురాలేదు. అదే సుబ్రహ్మణ్యంగారిలోని విశేషం. అందుచేతనే ప్రత్యేకవ్యక్తిత్వం గలిగిన అనేకమంది యువకులు ఆయన నంటిపెట్టుకొని ఏ త్యాగానికైనా సంసిద్ధులయ్యేవారు.

1926 సం॥లో ఆశ్రమ ఆవరణలో తూర్పుగోదావరిజిల్లా కాంగ్రెస్ మహాసభ కాశేశ్వరరావుగారి అధిపత్యాన జరిగింది. నీరుకొండ వెంకటరత్నం చౌదరి (నీరుకొండ రామారావుగారి తండ్రి) స్థానికంగా పెద్ద అవడంచేత ఆయనకు ఆహ్వానసంఘాధ్యక్షుడుగా సభను రెండురోజులపాటు నిర్వహించాము. ఆ సమావేశంతోపాటు రాష్ట్రకాంగ్రెస్‌సంఘ సమావేశంకూడ జరిగింది. రాజకీయంలో మేము కాశేశ్వరరావుగారికి అంత అనుకూలురము కాము. కాని రాష్ట్ర కాంగ్రెస్‌పెద్దగా మేము ఆయనను గౌరవించేవాళ్ళం. ఆహ్వానసంఘాధ్యక్షుడుగా నీరుకొండ నోట రెస్పాన్సివ్ కోఆపరేషన్ కనుకూలంగా చెప్పించినమాటలు భారతదేశం దృష్టి నాకర్షించాయి.

అప్పట్లో ఆశ్రమంనుంచి సుబ్రహ్మణ్యంగారు, అన్నపూర్ణయ్య, నేను, వెంకటప్ప రాష్ట్ర కాంగ్రెస్ సభ్యులుగా వుండి కాంగ్రెస్ దైనందిన కార్యక్రమాలలో పనిజేస్తూండేవాళ్ళం.

సుబ్రహ్మణ్యంగారు మాత్రం శాసనసభా రాజకీయాలలో ఏవిధమైన ఆసక్తినీ చూపేవారుకారు. కానీ మేంచేసే పనికి పూర్తిగా దోహదమిచ్చేవారు.

ఆశ్రమంలో జరిగిన మహాసభకు కొన్నివందలమంది ప్రతినిధులు వచ్చారు. వారందరికి భోజన మజ్జనాది సౌకర్యాలన్నీ మా ఆవరణలోనే జరిగాయి. పందిళ్ళు, పాకలు నిర్మాణం మొదలు వాలంటీర్ పనివరకూ ఆశ్రమ

వాసులూ, అచ్చటి విద్యార్థులూ సర్దుకున్నారు. భోజన భాజనాలకు, పందిళ్ళకు పాకలకు కావలసిన సామగ్రులు ప్రజలు లోటనేది లేకుండా తెచ్చి పడేసే వారు, కబురు అందినంత మాత్రాన కావలసిన సామగ్రులు బళ్ళతో తోలిపెట్టే వారు. అలాంటి సందర్భాలలో ప్రజలు మాతో ఏకమై పనిచేస్తూవుండడంచేతనే ఆశ్రమం ఉనికి, వికాసం, ప్రతిష్ఠా నిలబడ్డాయి. దేశానికి సంబంధించిన రాజకీయ కార్యక్రమాలన్నిటినీ ముఖ్యంగా. 'కాంగ్రెస్' పత్రిక వర్గంవారు నిర్వహిస్తూ వుండేవారు. ఆశ్రమం చుట్టుప్రక్కల వుండే గ్రామాలవారు, గోదావరి కివ్వలిగట్టున వుండేవారు ఏమాత్రం అవకాశమున్నా రోజూ తీరిక సమయాలలో ఆశ్రమానికొచ్చి మాతో కొంతకాలం గడిపేవారు. వారు మా గోష్ఠులలో పాల్గొంటూ వుండేవారు, కాంగ్రెస్ పత్రికను అమూలాగ్రంగా చదివి మారకంరేటు మొదలైన క్లిష్టసమస్యలను అవగాహన చేసుకునేవారు. ఆవిధంగా కూడా అప్రయత్నంగా గ్రామీణ రాజకీయ నాయకత్వం అభివృద్ధి చెందుతూ వుండేది, అందుచేతనే ప్రభుత్వం, ఆశ్రమవాసులను జైళ్లకు పట్టుకుపోయినా ఆ ప్రాంతంలో వుద్యమాలను అణగగొట్టలేకపోయింది.

సీతానగరం ఆశ్రమం ప్రజలకు సన్నిహితం కావడానికి ప్రధానమైన కారణం శ్రీ సుబ్రహ్మణ్యంగారు వైద్యశాలద్వారా ప్రజలకు చేసిన సేవని చెప్పాలి.

సహాయ నిరాకరణోద్యమంలో ప్రవేశించడానికి ముందు, సుబ్రహ్మణ్యంగారు రాజమండ్రిలో ప్రసిద్ధులైన డాక్టరు, ధనం, పేరుప్రతిష్ఠలు కూడ ఆయన బాగా సంపాదించాడు. డబ్బుయెడల ఆయన కెప్పుడూ లక్ష్యంలేని కారణంగా, దానినంతగా నిల్వచేసుకోలేదు.

ఆయన శస్త్రచికిత్సయందు నేర్పరి. ఇప్పటివారికుండే డిగ్రీలు లేక పోయినా, బహూ సాహసంగా నేర్పరితనంతో శస్త్రవైద్యం చేసేవారు.

అందుచేత రాజమండ్రిలో కొన్ని పెద్దకుటుంబాలవారు ఆయనమీద ఆధారపడి వుండేవారు, ఆయన హస్తవాసి మంచిదనే పేరుకూడా వుండేది.

ఒడుదుడుకులు వచ్చినపుడు ఆయన పరికరాలకోసం, సహాయంకోసం ఆగేవారు కారు. రేజరు బ్లేడులతో సాటుపరికరాలతో శస్త్రచికిత్సచేసినా, నా యెరుకలో ఎన్నడూ ఆకారణంచేత రోగికి ప్రమాదం కలుగలేదు. శస్త్రచికిత్సకులు చూపే భేషజం, నోటికి గుడ్డ, ముక్కుకు గుడ్డ కట్టుకోవడం, ఏప్రన్‌లు ధరించడం. అంతగా కనబడేదికాదు. ప్రాణంమీద కొచ్చినపుడు యిలాటివాటికోసం కూచుంటామా అనేవారు.

ఇంతటి ప్రతిష్ఠతో ఆయన సీతానగరంచేరి యిష్టంలేకపోయినా కాలక్షేపానికి వైద్యం ప్రారంభించారు. అచిరకాలంలోనే ఆయనఖ్యాతి చుట్టుప్రక్కల వ్యాప్తమైంది. ఆశ్రమం ప్రారంభించడంతో, వైద్యశాల తప్పనిసరయింది. ఆయనకు సహాయకుడుగా తేతలి సుబ్బారావు అనే కాంపౌండరు వుండేవాడు. ఆయన తాను వడుక్కున్న నూలుతో తయారైనబట్టను కట్టుకునే దీక్షలోనివాడు. వృత్తిధర్మంలో చాలా మెళుకువ, సేవాదృష్టికలవాడు. అచిరకాలంలో ఆశ్రమానికి వైద్యంకోసం వచ్చేవారిసంఖ్య చాలా పెరిగిపోయింది.

అప్పట్లో పెద్దజబ్బులకు లోనై చికిత్స పొందవలసినవారు రాజమహేంద్రవరం పోవలసి వచ్చేది. దూరం 14 మైళ్లు అయినా ప్రయాణ సౌకర్యాలు లేని కారణంచేత సామాన్యప్రజలు చాలా యిబ్బందిపడేవారు. ధనికులైనవారు కూడా ఒక్కొక్కప్పుడు నిస్సహాయులై సకాలంలో పొందవలసిన చికిత్స పొందలేకపోయేవారు. కనుక గోదావరి అవతలనుండి గూటాల, తాళ్లపూడి గ్రామాలవారూ, రాఘవపురం, కేశవరం మొదలైన కోరుకొండ ప్రాంతాలవారూ కూడా ఆశ్రమం వైద్యశాలకే వచ్చేవారు. అందుచేత వైద్యశాలను తప్పనిసరిగా పెంచవలసి వచ్చింది. రోగులు వుండేటందుకు పాకశాలను కల్పించి మరొక డాక్టరును నియమించడం జరిగింది. చివరంటా ఎవ్వరో ఒక డాక్టర్ వుంటూవుండేవారు. వైద్యసేవ మూలంగా, యెన్నడూ రాజకీయప్రభావానికి లోనవుతారని అనుకోని కొందరు వుండడానికి వసతులు కట్టించారు. అదిగాక ఎప్పుడు అవసరం వచ్చినా ఆయన కొంగుబంగారంలా ఉపయోగపడ్డారు.

గూటాల గ్రామంలో ధనికులైన వైశ్యకుటుంబాలు చాలా వున్నాయి. వారంతా ఆశ్రమ వైద్యశాల ప్రభావంవల్ల ఖద్దరుధారులు, గాంధీజీభక్తులు అయినారు. అందుచేత గూటాలలోనే ఒక వైద్యశాలను ఆలమూరి సీతా రామస్వామి అనే శ్రీమంతుని యింటిలో వుంచవలసిన అవసరం ఏర్పడింది. ఒకపాటి వైద్యం సీతారామస్వామిగారి చేతిమీదుగానే జరిగిపోయేది. కాస్తంత ఆసక్తి వుంటే అలాటి వైద్యులను తయారుచేయడంలో సుబ్రహ్మణ్యంగారిని మించిన వారుండరు. అలాటి ప్రాథమిక చికిత్స చేయగలిగినవారిని యేటిగట్టు గ్రామాలలోను,- కోటికేసవరం, రాఘవపురం ప్రాంతాలలోనూ ఆయన తయారుచేశారు.

మొత్తంమీద గ్రామీణప్రజలకు రాజకీయపరిచయం కలిగించడానికి వైద్యసహాయం చాలా వుపయోగపడిందనడానికేమీ సందేహం లేదు.

సీతానగర ఆశ్రమ చరిత్రలో 1929 సం॥రం చాలా ముఖ్యమైనది. గాంధీరాక, అన్నపూర్ణయ్య నిర్బంధం, ఆశ్రమశాఖల విస్తరణం మొదలైన విశేషాలెన్నో జరిగాయి.

రాజకీయంగా ఆ సంవత్సరం పూర్ణ స్వాతంత్ర్య దీక్షా వత్సరం. డిసెంబర్ 31 రాత్రి 12 గంటల లోపుగా బ్రిటిష్వారు అధినివేశ స్వాతంత్ర్య ప్రతిపత్తి నంగీకరించకపోతే, తానుకూడా పూర్ణస్వాతంత్ర్య దీక్షాపరుడ నవు తానని కలకత్తా కాంగ్రెస్‌లో గాంధీజీ దేశానికి మాటయిచ్చారు. 1929 సంవ త్సరమంతా స్పీకర్ విఠల్‌భాయి పటేల్, మదన్‌మోహన్ మాలవ్యా వంటి ప్రముఖులెందరో రాయబారాలు నడిపి, ఎన్నో విధాలుగా ప్రయత్నాలు చేసి నప్పటికీ బ్రిటిష్ప్రభుత్వం చలించలేదు. అందుచేత జవహర్లాల్ అధ్యక్షతన జరిగిన లాహోర్ కాంగ్రెస్‌లో 31వ తేదీ అర్ధరాత్రి మనుష్యులు గడ్డకట్టుకు పోయే చలిలో పూర్ణ స్వాతంత్ర్య తీర్మానం ఆమోదింపబడింది. అపారమైన కోలాహలంతో, జనమంతా ఆనందోత్సాహంలో మునిగిపోయారు. గాంధీజీ ఒక్కడే అచంచలంగా నిలబడిపోయారు. ఆరోగ్య మంత సరిగాలేకపోయినా మోతీలాల్ కూడా కేరింతలుకొట్టి ఆనందంలో పడ్డారు.

ఆ స్థితిలో శ్రీమతి సరోజినీదేవి "మేమంతా యిలాంటి ఆనందంలో వుంటే నువ్వేమయ్యా అలా వులుకూ పలుకూ లేకుండా వున్నావు?" అని గాంధీజీని హెచ్చరించింది. "మీ పూర్ణస్వాతంత్ర్యం వేరు; నా పూర్ణ స్వాతంత్ర్యం వేరు. నేను పూర్ణస్వాతంత్ర్యవాదినైనాక, దానిని సాధించే సాధనాన్ని రూపొందించాలి కదా!" అన్నారు.

లాహోరు కాంగ్రెస్ నాటికి ఏ.ఐ.సి.సి. లో సుబ్రహ్మణ్యంగారు, నేనూకూడా సభ్యులం. తీర్మానం ఆమోదింపబడిన మరునటిరోజున గాంధీజీ రావీనది ఒడ్డున తెల్లవారుఝామున 5 గంటలకు షికారుచేస్తూ ఆంధ్రులను ప్రత్యేకంగా కలుసుకున్నారు ఆ సందర్భంలోనే రాముడు తనకింకా సత్యాగ్రహ స్వరూపాన్ని చూపించలేదని, దానికొరకే తాను దేవుణ్ణి ప్రార్థిస్తున్నానని చెప్పేరు. తాను రూపొందించదలచుకున్న పోరాటంలో ఆంధ్రులు, గుజరాతీయులు, బీహారీయులు గొప్పపాత్రను వహిస్తారని ఆశించారు. **"I expect great things from Andhra, Bihar and Gujarat"** ("ఆంధ్ర, గుజరాత్, బీహార్ రాష్ట్రాలు గొప్పగా పాల్గొంటాయని నేను ఆశిస్తున్నాను.")

ప్రత్యేకంగా సుబ్రహ్మణ్యంగారు మా ఆశ్రమాన్ని ఏంచేయమంటావు? అని అడిగినపుడు, "డాక్టర్! మీరు ఎక్కువ పెట్టుబడులతో ఖాదీ వగైరా కార్యక్రమాలు చేయకండి!" "perhaps I will have to throw you in the Ouldren first" (బహుశా మీ ఆశ్రమాన్నే ప్రథమంగా యీ చిచ్చుకు ఆహుతిచేస్తానేమో) అన్నారు. లాహోర్ కాంగ్రెస్ నుండి తిరిగివచ్చాక, ఏనాటి కానాడే గాంధీజీ ఆజ్ఞకోసం ఎదురుచూస్తూ వుండేవాళ్లం. రాబోయే పోరాటానికి ఏమి తర్ఫీదుకావాలని, ఏమి శిక్షణ గాంధీజీ అమలు జరుపుతారో అని అంచనాలు కట్టుకుంటూ వుండేవాళ్ళం.

జనవరి రెండవవారంలో కాంగ్రెస్ కార్యవర్గం సమావేశమై పూర్ణ స్వాతంత్ర్య ప్రతిజ్ఞను ఆమోదించింది. దాని రచనకుముందు జవహర్‌లాల్ ఒక ముసాయిదాను తయారుచేశాడనీ, దానిని వర్కింగ్‌కమిటీ అంగీకరించ

సందున- గాంధీజీయే స్వహస్తూరీతో దానిని వ్రాశాడనీ చెప్పుకున్నారు. ఆ స్వాతంత్ర్య ప్రతిజ్ఞ రచనలోని పదబంధము సమగ్రత, లక్ష్యశుద్ధి, కార్యదీక్ష నిరుపమానమని చెప్పకతప్పదు. ఒకప్పుడు మోతీలాల్ నెహ్రూ గాంధీజీ భాషను గురించి చమత్కరిసూ "It is the ianguage of the heart. It cames from the heart, and goes to the heart." (గాంధీజీ భాష హృదయంలోంచి వస్తుంది. హృదయానికి హత్తుకుంటుంది) అన్నాడు. అలాగే ఆ స్వాతంత్ర్యప్రతిజ్ఞ పాఠం తపశ్శాలియైన గాంధీఋషి హృదయం లో నుంచి పుట్టుకొచ్చిందనే చెప్పాలి. నిజంగా అదొక మహా మంత్రమైంది.

ఆ సంవత్సరం జనవరి 26 వ తేదీ ఆదివారం. ఆనాడు దేశమంతా స్వాతంత్ర్య ప్రతిజ్ఞను తీసుకోవాలని కాంగ్రెస్ ఆదేశించింది. ఆనాడు కాంగ్రెస్ అంటే గాంధీజీ. అప్పట్లో దేశంలోవుండే మందవాతావరణాన్నిబట్టి యీ ప్రతిజ్ఞా స్వీకరణంవల్ల యేపాటి వుత్సాహం కలుగుతుందా యని చాలమంది సంకోచపడ్డారు.

సరిగ్గా 41 సంవత్సరాల అనంతరం ఆనాటి దృశ్యాలు తలుచుకుంటే ఒళ్లు జలదరిస్తుంది. 26 వ తేదీ ప్రతిజ్ఞను గురించి ఆశ్రమం చుట్టుప్రక్కల నున్న గ్రామాలన్నిటికీ కబుర్లు పంపేం. 26 వ తేదీ సాయంకాలం బహిరంగ సభకు ఆబాలగోపాలం ఆశ్రమానికి వచ్చారు. ఆనాడే స్వరాజ్యం వచ్చిందా అన్నంత సంతోషంతో ఖద్దరు ధారులైన స్త్రీ పురుషులు పాల్గొన్నారు. శ్రీ సుబ్రహ్మణ్యంగారు సహజ గంభీరతతో మహోపన్యాసం యిచ్చారు. అప్పటికప్పుడే బార్డోలిలో రైతు పన్నుల నిరాకరణోద్యమం మహోజ్జ్వలంగా జరుగుతున్నది. సుబ్రహ్మణ్యంగారు బార్డోలి రైతులవలె మన రైతులు కూడ స్వాతంత్ర్య పోరాటంలో దూకాలని హెచ్చరించి స్వాతంత్ర్యప్రతిజ్ఞను చదివించారు. అప్పటికి ఆ పోరాట మేరూపందాలుస్తుందో యెవరూ ఊహించని స్థితిలోనే వున్నారు.

ఉప్పుపన్ను రద్దువిషయంగా గాంధి సత్యాగ్రహాన్ని రూపొందింప దలచినట్లు డాక్టర్ పటాభిగారు ఉప్పందించారు. దానితో ఉప్పుపన్ను చరిత్రను

ఘణ్ణంగా తెలుసుకున్నాం. కాంగ్రెస్ పత్రికలో దానిని గురించి ఎంత కవిత్వం అల్లాలో అంతా అల్లేం. ఈనాడు ఆ ఉప్పుస్థితి చూస్తుంటే ఆనాడు దానిని గురించి ఎంత ఉత్ప్రేక్షించామా అనిపిస్తుంది.

1930 సం॥రం ఫిబ్రవరి నెలలో, ఏ శాంతిపోరాటానికైనా సిద్ధపడే శాంతిసైనికులకు తర్ఫీదునివ్వడానికి రాష్ట్రం మొత్తంమీద ఒక శిబిరాన్ని యేర్పాటుచేశాం. శ్రీకాకుళం నుంచి అనంతపురం వరకు సుమారు నూరు నూటయేభై మంది శిబిరంలో శిక్షణపొందేరు. డాక్టర్ హర్డికర్ గారి హిందూస్తాన్ సేవాదళ్‌కు చెందిన కెప్టెన్ కృష్ణమూర్తి అనే యువకుడు శిబిరాధిపతిగా వుండేవాడు. ఒక యేడాదిక్రితమే మరణించిన కీర్తిపాటి దయానందరాజు కూడా ఒక శిక్షకుడే. అతడు మొదట్లో కన్నడదేశం నుండి వచ్చినా, సాంబమూర్తిగారి ఆప్యాయతవలన కాకినాడలోనే స్థిరనివాస మేర్పరచుకున్నాడు. ఆ శిబిరంలో తయారైన వారెందరో వున్నారు వారిలో నాకు జ్ఞాపకమున్నంతవరకు అల్లూరి సత్యం ఒకడు. ఆ శిబిరం దాదాపు నెల రోజులపాటు సాగింది. ఆ శిబిర నిర్వహణకు డబ్బు ఎలావచ్చిందో యిప్పుడు వూహించడం కష్టం. ఆహారపదార్థాలు కొల్లలుగా వస్తుండేవి. అంతటి కార్యక్రమాలు ఆశ్రమంలో జరుగుతూవుంటే పోలీసులు ఎంత హడావుడి పడుతూ వుండేవారో వేరే చెప్పనక్కరలేదు. 1928 సం॥ నుండి తరుచుగా పోలీసులు సోదా కార్యక్రమాన్ని సాగిస్తూవుండేవారు. మేమెన్నడూ రహస్య కార్యక్రమములను తలపెట్టలేదు. కనుక సోదాలవల్ల పోలీసులకేమీ ప్రయోజనం వుండేదికాదు. 1930 సం॥రం ఆరంభంనుండి సీతానగరం పోలీసులకు నివాసస్థానమైంది.

సత్యాగ్రహ శిక్షణశిబిరం సాగుతున్నంతకాలం, అక్కడి గ్రామాల నుండి జనం తీర్థప్రజ లాగున ఆశ్రమానికి వస్తూవుండేవారు, జనం అమితోత్సాహంతో వుండేవారు.

మార్చినెల ప్రారంభం అయ్యేసరికి గాంధీజీ సత్యాగ్రహానికి ఒక రూపమూ, కార్యక్రమమూ యేర్పడింది. ఆయన సబర్మతీ ఆశ్రమం నుండి

దండీ సముద్రతీరంవరకూ అనుచరులతో కాలినడకను ప్రస్థానం సాగించారు. ఆ ప్రస్థానంలో మా ఆశ్రమప్రతినిధిగా శ్రీ చండ్రుపట్ల హనుమంతరావు పాల్గొన్నాడు. గాంధీజీ దండి చేరుకొన్నాక యితరరాష్ట్రములవారిని ఆ యా రాష్ట్రాలకు పంపేశారు. ఇంతలో సాంబమూర్తిగారు బళ్లారిజైలునుండి విడుదలై గుంటూరులో నడింపల్లివారి యాజమాన్యాన బ్రహ్మాండమైన స్వాగత సత్కారముల నందుకొని, సరాసరి సీతానగరం వచ్చేశారు. ఆయన నాయకత్వాన సీతానగరం నుండి జిల్లాలోని సత్యాగ్రహ సమరయోధులంతా సంవత్సరాది పండుగనాడు బయలుదేరి రాజమండ్రిమీదుగా సెంట్రల్ డెల్టాలో సంచారంచేసి రామచంద్రపురం మీదుగా కాకినాడ ఏప్రెల్ 6 వ తేదీకి చేరుకొని అక్కడ ఉప్పుచట్ట ధిక్కారాన్ని ప్రారంభించాలని కార్యక్రమం నిర్ణయింపబడింది. దానికి బులుసు సాంబమూర్తిగారికి సహాయ సేనానులు శ్రీ సుబ్రహ్మణ్యం, శ్రీ వెన్నేటి సత్యనారాయణ (జిల్లాకాంగ్రెస్ ప్రెసిడెంటు). కళా వెంకట్రావు గార్లు.

1930 సం॥ మార్చినెల సంవత్సరాది పండుగ. దాదాపు రెండువందల మంది సుశిక్షితులైన సత్యాగ్రహులు, ఉప్పు సత్యాగ్రహ సమరరంగానికి నడుంకట్టేరు, ఒక్కడూ పెండ్లాము బిడలగురించిగానీ, కుటుంబాలనుగురించి గాని, వారి పోషణగురించిగాని తలపెట్టినవారు లేరు. వెడుతున్నది ఏమవుతుందో తెలియని సమరానికేగాని, వెళ్లేవారంతా పెండ్లికెడుతున్నంత సరదాలో వున్నారు. పన్నెండు గంటలకు పండుగ విందుభోజనం చేసి రెండు గంటలకు అత్యవసరమైన సామగ్రులతో యాత్ర ప్రారంభించారు. జయజయధ్వానాలు మిన్నుముట్టేయి. ఆనాటి మజిలి 6 మైళ్లు. అచటి ప్రజలు వారికెంతో ఆదరణతో స్వాగతమిచ్చి భోజన మజ్జనాది సౌకర్యాలను కలిగించారు. ఆ రీతిగా రోజూ పది పన్నెండుమైళ్ళు చొప్పున సుశిక్షణతో నడక సాగిస్తూ ఏప్రిల్ మొదటివారంలో అనగా జాతీయవారం ప్రారంభం అయ్యేసరికి కాకినాడలోని సత్యాగ్రహ శిబిరం చేరుకున్నారు.

నిర్మాణ కార్యక్రమ నిర్వహణకు, కాంగ్రెస్ పత్రికను నడిపించ డానికి కొందరు యీ ప్రస్థానంలో చేరకూడదని ఆశ్రమ పాలకవర్గం నిర్ణ యించింది. పత్రికా నిర్వహణకు నన్ను, ఖద్దరుపనికి శ్రీ ధరణీప్రగడ శేష గిరిరావును, లెక్కడొక్క చూడడానికి, కుటుంబాల సాధకబాధకాలను చూడ డానికి శ్రీ మామిడి లక్ష్మీపతిని నియమించింది. నేను ఉద్యమంలో పాల్గొనా లనే ఆసక్తిని గట్టిగా వ్యక్తపరచడంచేత, నాకొక షరతును పెట్టారు; పత్రిక నిర్వహించగల ఒకవ్యక్తిని నా స్థానంలో కూర్చోబెట్టి ఉద్యమంలో చేరవచ్చు నన్నారు. ఆ కారణంగా స్వర్గీయ దాసు దామోదరరావు గారిని నేను ఆహ్వా నించి తీసుకొచ్చాను. శ్రీ దామోదరరావుగారు 1921 సం॥లో బి ఏ. చదు వుతూ చదువు చాలించిన దేశభక్తుడు. స్వతహాగా బాగా స్థితిపరుడు. సహకా రోద్యమంలో చేరి మద్రాస్ స్టేట్ కోఆపరేటివ్ బ్యాంకులో అసిస్టెంట్ మానే జరుగా పనిచేస్తూవుండేవారు. ఆయనచేత సెలవుపెట్టించి, పత్రికా సంపాద కత్వాన్ని ఆయనకు అప్పగించి ఉద్యమంలో పాల్గొనడానికి కాకినాడ వెళ్ళి పోయాను. సీతానగరం నుంచి ప్రస్థానం ప్రారంభమై వెళ్ళిననాడు ఒక్క సారిగా ఆశ్రమం బావురుమంది. వందలమందితో కళకళలాడే ఆశ్రమం- ఒక్కసారిగా ఖాళీ అయ్యేసరికి నిస్తబ్ధత యేర్పడింది. అప్పుడు రాజోలు వాస్తవ్యుడు, దేశభక్తుడు, ఆయుర్వేదాచార్యుడు, పండితుడు, వక్త అయిన శ్రీ మల్లాది రామమూర్తి శాస్త్రిగారు అప్పు డక్కడే వుండడం జరిగింది. ఆయనకు కాలు కొంచెం అవిటి అవడంచేత ప్రస్థానంలో పాల్గొనలేక పోయాడు. అనా డాయన కన్నీరు మున్నీరుగా విలపిస్తుంటే త్యాగం మను ష్యుల నెంతగా కదుపుతుందో అనిపించింది. కొన్నిరోజుల తర్వాత ఆయన తన వాగ్ధాటిచేత వేలకొలది ప్రజల్ని ఉద్యమానికి ప్రోత్సహించి తానే రెండు సంవత్సరాలు శిక్షకు గురియైనాడు.

ముగ్గురు మినహాగా ఆశ్రమవాసు లంతా కాకినాడ శిబిరంలో యోధు లైనారు. నాయకులైనవారిని ముందుగానే అరెస్టుచేసి ఏడాది శిక్ష విధించారు.

రామచంద్రుని వెంకటప్ప మొదటిజట్టు ఆరుగురిలోను ఒకడై అరెస్టైఅయినాడు. ప్రభుత్వం తన నిర్బంధవిధానాన్ని మార్పుచేసి అరెస్టులకు బదులు లాఠీఛార్జీలను ప్రారంభించింది. కాకినాడ శిబిరంలో ఒకవిధమైన జాప్యం ప్రవేశించింది. అందుచేత ఉప్పుచట్ట ధిక్కారణను జిల్లాలోని కోస్తాప్రాంతా లన్నిటికి విస్తరింపజేయవలసి వచ్చింది. సీతానగరం ఆశ్రమవాసులు నా నాయకత్వాన ఉప్పాడ కేంద్రానికి తరలివెళ్లారు. క్రొత్తపల్లిలో శిబిరాన్ని యేర్పాటుచేసుకొని, ఆ సముద్రతీరాన ఉప్పుచట్ట ధిక్కారాన్ని సాగించాం. ఉప్పు ఏరడమే కాకుండా, చేపలపరిశ్రమకు, ప్రభుత్వంవారి ఉప్పు డిపోలనుంచి కాకుండా స్వేచ్ఛయైన ఏరుపు ఉప్పును వుపయోగించడం ప్రోత్సహించాం. ఆ కారణంచేత నన్ను, మరికొందరు మిత్రులను పట్టుకుపోయారు. తర్వాత ఆశ్రమవాసులే స్థానికుల ప్రోద్బలంతో సత్యాగ్రహాన్ని సాగించి జైలుకొచ్చేశారు. ఇంతలో కాంగ్రెస్ పత్రికమీద కూడా ఆంక్షలు ఏర్పడడంచేత ఆ నిషేధాలను ధిక్కరించి చండ్రుపట్ల హనుమంతరావు ఒకపత్రికను ప్రకటించి ప్రెస్‌ను విలుపుచేశారు.

అంతటితో ఆశ్రమం ఒక విరామస్థితిలో పడింది. ఏ నిమిషంలో ఖద్దరుమీద కూడా దండయాత్రలు జరుగుతాయో అన్న భయంచేత ఆ కార్యక్రమాలు కూడా అంతంతమాత్రంగానే కొనసాగింపబడ్డాయి. ఆశ్రమవాసులందరు మద్రాసు రాష్ట్రంలోని వివిధ కారాగారాల్లో చిక్కుకుపోయారు. 1930 సం॥ ఏప్రిల్ నెలనుండి సంవత్సరాంతం వరకు గడువు కొద్దిమాసాలే అయినా వ్యక్తిగతంగాను, సమిష్టిగా కూడా యెన్నొకష్టాలకు గురికావలసి వచ్చింది. కుటుంబానికు సంరక్షకుడుగా వుండాలని మేము సత్యాగ్రహంలో చేరవద్దని కోరిన మిత్రుడు మామిడి లక్ష్మీపతి సర్పదష్టుడై మరణించాడు. మరి వారంరోజులు తిరగకుండానే నా ఏకైక సోదరి వృద్ధులైన తల్లిదండ్రులను విడిచి స్వర్గస్తురాలైంది. ఆ వార్త నాకు మద్రాస్ జైలుకు టెలిగ్రాంద్వారా తెలుపబడింది కాని, నేను జైలు క్రమశిక్షణకు సంబంధించిన ఆంక్షలో వుండటం వలన టెలిగ్రాంలు, వుత్తరాలు నా కందివ్వలేదు. ఇది జరిగిన

వారం పదిరోజులకు నేను మద్రాసునుండి అరిప్పరం కొండప్ప మైలుకు 108 గురితో వెళుతున్నప్పుడు మిత్రులు భరద్వాజగారు కేపుగారిజాష్ణ అరోజు సాయం స్టేషన్‌లో ఆవార్త అందచేశాము. ఆవార్త హృదయవిదారకమైనది. అటువంటి ఆపదల నెన్నో దిగమ్రింగిన స్వాతంత్ర్య సమరయోధులను చూసి మనసును రాయి చేసుకోవలసి వచ్చింది.

1930 సం॥ నవంబర్ నెలలో నేనూ, శ్రీ నాకుచంద్రుని వెంకటప్ప, మరికొందరు ఆశ్రమవాసులు విడుదలై వచ్చాం. లాఠీఛార్జీలవలన జిల్లాలోని కార్యకర్తలు నిరుత్సాహపూరితులై యున్నారు. విడుదలైన వారంరోజుల అనంతరం సాంబమూర్తి, సుబ్రహ్మణ్యం గార్లను కన్ననూర్, తిరువలూరు జైళ్ళలో కలసి వారి ఆదేశానుసారంగా చెన్నపట్నంలో సత్యాగ్రహాన్ని ఏదో రూపంగా కొనసాగించడానికి నిశ్చయించుకున్నాం,

పోలీసు నిఘాలోనే గోదావరి జిల్లాలో సత్యాగ్రహుల నందరినీ కలిసి తమిళనాడులో బయటనున్న కొందరి మిత్రులను కలిసి శాసన ఉల్లంఘనాని కొక కార్యక్రమాన్ని నిర్ణయించాము. ఈ విషయంలో సమాలోచన చేయుటానికి పెద్దాపురంలో తోటవిందు ఏర్పాటుచేయబడింది. ఆ విందులో లాఠీఛార్జి జరగడం, అందులో పెద్దాడ కామేశ్వరమ్మ, దువ్వూరి సుబ్బమ్మ మొదలైన స్త్రీలకు, బారిస్టర్ స్వామిగారికి, డా॥ యస్. వి. రామారావుగారు మొదలైన అస్త్రదాదు లందరికీ ఒళ్ళువాచే దెబ్బలు తగలడం జగమెరిగిన కథనమే! తదనంతరమే గోదావరి జిల్లానుంచి పెద్దాడ కామేశ్వరమ్మ, వెంకటప్ప, నేనూ మరికొందరం మద్రాసులో జార్జిటౌనులో బట్టలదుకాణాల పికెటింగ్ ఏర్పాటు చేసి, సత్యాగ్రహం ప్రారంభించాము. పిఠాపురం తాలూకా కొత్తపల్లి గ్రామం ఈ ఉద్యమానికి చాలామందిని పంపింది. రోజూ ఇద్దరు తమిళవాలంటీర్లనూ, ఇద్దరు తెలుగు వాలంటీర్లనూ, రామకృష్ణ లంచ్‌హోమ్‌లో ఫలహారం చేయించి బట్టలదుకాణంవద్ద పికెటింగ్‌కు పంపేవాళ్ళం. వాళ్ళని పోలీసులు చావగొట్టి ఈడ్చేసేవారు. అందులో అరవ వాలంటీర్లు దెబ్బలుకొట్టడంతో పలాయనం

చిత్తగించేవాళ్లు. వెలుగుబాట్ల నిలుపేవారు. దగ్గరి కొట్టి మద్రాసులో శ్రీపాద శంకర్ అనే యువకుడు, మేము వారితో కలుపుకోని నడిచే వాళ్ళం. రామారావు వ్యక్తులు ప్రత్యేకంగా ఏర్పాటుచేసిన నర్సింగ్ హోమ్‌లో సేవ చేయించే వాళ్ళం. దాదాపొక నెలరోజులు ఇదేరంతు జరిగింది. డాక్టర్ ఏ. వి. నాగేశ్వరరావు. పక్కలెంత సుబ్బారావు గార్లు కూడా ఈ సత్యాగ్రహంలో అరెస్టు అయినారు. ఒకరోజున నేనూ, వెంకటప్పా కూడా కామాక్షా ఈ సంగం లోకి పోవలసి వచ్చింది. మొదటిరోజున చిత్తూరుపోలీసులు మమ్మల్ని కొంచెం చిన్నచూపే చూశారు. మర్నాడు ప్రెంచదేశపు సనుకరేటు కొందరు. లయోలాకాలేజి ప్రిన్సిపాల్ టి. ఆర్. వెంకట్రామశాస్త్రి మొదలైనవారంతా చూడడానికి వచ్చారు. ఆ రోజున అనుకోకుండానే మొత్తరం సంగంలోకి దూకాము. అసలు మలబారుపోలీసులు లాఠీలతో దెబ్బలు కొడుతూ కొట్టి రోడ్డుప్రక్కకు యీడ్చేశారు. శరీరంమీద కొన్నిచోట్ల చిరిగిన వానిపుణ్యం వచ్చింది. తర్వాత చికిత్స షరా మామూలే.

మేము ఆస్పత్రిలో వుండగా శ్రీ నాగేశ్వరరావు పంతులుగారున్నూ, యు. రామారావుగారున్నూ కొందరు తెల్లవాళ్ళను వెంటపెట్టుకుని చూడడానికి వచ్చారు. మంట మంటగావుండే సమయంలో ఆ తెల్లవారు పల్కరింప బోతే 'పొండయ్యా! ఒకళ్ళు కొడతారు, మరొకళ్ళు ఓదారుస్తారు. పొండి' అని విసుక్కుంటుంటే నాగేశ్వరరావు పంతులుగారు అసలు విషయాన్ని చెప్పారు. అదొక ప్రత్యేక ఘట్టం. ఆ కాలపు చరిత్రలో అదొక విశేష ఘట్టం. ఇంత జరుగుతువుంటే 'హిందు' పత్రిక "వాలంటీర్లు చెదిరిపోయ బడ్డారు." అని ఒక్కమాటతో రిపోర్టు ముగించేది. 'స్వరాజ్య' దిన పత్రికలో మాత్రం వివరాలు పడేవి. ఈ విషయం యిక్కడ ఎందుకు రాస్తున్నానంటే చాలమంది ఆ కాలపు చరిత్రను వ్రాయదల్చుకున్నవారు 'హిందూ' పత్రిక మీద ఆధార పడతా మంటారు. అది చాలదనడానికి ఈ విషయాన్ని వుదహరిస్తున్నాను.

ఇంతలో మోతీలాల్ నెహ్రూ మరణంవల్ల సత్యాగ్రహోద్యమానికి విశ్రాంతి యివ్వబడింది. ఆపిమ్మట సప్రూ జయకర్ల రాయబారాల ఫలితంగా నాయకుల విడుదల జరిగి, గాంధీ – ఇర్విన్ ఒడంబడిక జరిగింది. అంతకు ముందే సుబ్రహ్మణ్యంగారు విడుదలై ఆశ్రమానికి వచ్చినవెంటనే ఆయన తల్లి లక్ష్మీనరసమ్మ మరణించడం జరిగింది. ఆమె వీరమాత. చదువు రాకపోయినా మంచి వాగ్ధాటివుండేది. ఉభయగోదావరిజిల్లాలలోను ఆమె సంచారం చేసి సంవత్సరానికి వేల రూపాయల విలువైన ఖద్దరు అమ్మేది. 'మామ్మ' అని అందరిచేత ఆప్యాయంగా పిలువబడే ఆమెవంటి వీరమాత సర్వదా పూజనీయులు.

సుబ్రహ్మణ్యంగారి తల్లి మామ్మగారు మరణించిన పదకొండవ రోజున గాంధీజీకి - వైస్రాయి ఇర్విన్ ప్రభువుకు మధ్య జరిగిన రాజీ సంప్రదింపులు ఫలవంతమైనవి. జైళ్ళలోని జనమంతా విడుదలైనారు. కానీ రాజీ జరిగిన మరునాడే భగత్‌సింగ్, రాజ్‌గురు, సుఖదేవ్ లను లాహోరు జైలులో వురి తీసారు. ఆ దుస్సంఘటనను ఆపడానికి గాంధీజీ చేసిన ప్రయత్నాలన్నీ విఫలమైనవి. ఈ దుస్సంఘటనవలన గాంధీ-ఇర్విన్ రాజీ వలన కలిగిన ఆనందమంతా పూర్తిగా తొలగిపోయింది, దేశమంతా విచార సాగరంలో మునిగిపోయింది.

రాజీ ఫలితంగా విదేశవస్త్రముల దుకాణాలవద్ద శాంతియుతంగా పికెటింగ్ చేసుకునే హక్కున్నూ, ఉప్పును స్వంత వాడకంకోసం యేరుకునే హక్కున్నూ ప్రజలకు లభించాయి. అప్పటికి అమలులో వున్న నిషేధపు ఉత్తరువులన్నీ తొలగి పోవడంచేత ఆశ్రమంలోని పూర్వపు కార్యకలాపాలన్నీ పునః ప్రారంభింప బడ్డాయి.

మార్చి ఆఖరు వారంలో :కాంగ్రెస్ పత్రికను తిరిగి ప్రచురించడం జరిగింది. సమరము – సంధి అనే పేరుతో సత్యాగ్రహ సమీక్ష చేయబడింది. 'ప్రథమ కబళే మక్షికాపాతః' అన్నట్లు ప్రథమ సంచికలోనే 'వీరబలి' అని

సంపాదకీయంలో భగత్‌సింగ్ ప్రభృతుల ఉరిని గురించి ప్రభుత్వాన్ని తీవ్రంగా విరశించవలసి వచ్చింది. దాని ఫలితంగానే అగస్టు నెలలో రాజద్రోహ నేరం క్రింద రెండున్నర సంవత్సరాల కఠిన శిక్ష నాకు లభించింది. పత్రికను తిరిగి ప్రారంభించిన రెండు వారాలు తిరగకుండానే కొత్తపేట తాలూకాలో చిన్నవాడపల్లి వెంకటేశ్వర క్షేత్రంలో రథోత్సవ సందర్భంలో రథం మీద గాంధీజీ బొమ్మనుపెట్టినందుకు లాఠీఛార్జి, కాల్పులు జరిగాయి. ఆ కథకంతకూ కథానాయకుడు రాజమండ్రి డిప్యూటీ పోలీస్ సూపరెండెంట్ ముస్తాఫాలీఖాన్. ఆ రోజుల్లో అతని ఖ్యాతి దేశమంతా వ్యాపించింది. కాల్పులు జరిగిన వెంటనే నేను స్వయంగా వాడపల్లి వెళ్ళి అప్పటి కథనంతా కాంగ్రెస్ పత్రికలో ప్రచురించాను. ఆ నాటి యింగ్లీషు పత్రికల్లో కల్లా ధైర్యంగా వార్తలు ప్రచురిస్తుండే 'స్వరాజ్య' పత్రికలో కూడ ప్రకటించాము. పోలీసుల పక్షాన ఆ నివేదికను గూర్చి ఖండనలు జరిగిన తర్వాత జరిగిన విచారణలో నా నివేదికలోని విషయాలే ధృవపరచబడినాయి. ఆ కారణంగా ముస్తాఫాలీకి ఆశ్రమంమీద చాల గుర్రుగా వుండేది.

గాంధీ - ఇర్విన్ ఒడంబడిక ఫలితంగా లభించిన పికెటింగ్ హక్కును ఉపయోగించడానికి రాజమండ్రిలో సుబ్రహ్మణ్యంగారి ఆధ్వర్యాన ఉద్యమం ప్రారంభించబడింది. రాజమండ్రి పరిసర గ్రామాలనుండి చాల మంది స్త్రీ, పురుషులు పికెటింగ్‌కు ముందుకు వచ్చారు. స్థానికులకు స్వర్గీయ డాక్టర్ కె. యల్. నరసింహారావుగారి యాజమాన్యాన ఒక స్వచ్ఛంద సేవా శిబిరం యేర్పాటు చేయబడింది. సీతానగరం ఆశ్రమం నుండి యావన్మంది స్త్రీ, పురుషులు రాజమండ్రిలో ప్రత్యేక శిబిరాన్ని నేటి వైశ్య సేవాసదనంలో యేర్పాటు చేశారు. ఈ రెండు శిబిరాలద్వారా కొన్ని నెలలపాటు పికెటింగ్ జరుగుతూ వచ్చింది.

అగష్టు నెలలో నేను అరెష్టు అయినాక, రామచంద్రుని వెంకటప్ప సంపాదకత్వాన కాంగ్రెస్ పత్రిక నడిచింది. సెప్టెంబరు నెలలో అన్న

పూర్ణయ్య విడుదలై సంపాదకత్వాన్ని వహించి 1932 జనవరి నెలలో ఆశ్రమం ప్రభుత్వం పరమయేవరకు నిర్వహించాడు. ఖద్దరు మొదలైన నిర్మాణ కృషి కూడా బాగానే జరిగింది.

1932 సం॥ జనవరి నాల్గవ తేదీని గాంధీజీని బొంబాయిలో అరెస్టు చేయడం, ఆ నాడే సాంబమూర్తి, పారుపూడి సత్యనారాయణ, రామమోహన రావు. దుర్గాబాయమ్మ ప్రభృతులను కాకినాడ టవున్ హాలు ఆవరణలో చావగొట్టడం వగైరా ఘట్టాలు చరిత్రప్రసిద్ధమే. ఆ ఘట్టం జరిగిన రెండు మూడు రోజులలో ముస్తాఫాలీఖాన్ ఆశ్రమం మీద దండయాత్ర సాగించాడు. అలాటి ప్రయత్నం జరుతోందన్న సంగతి ముందుగా తెలియడంచేత వృద్ధులను, స్త్రీలను బయటకిపంపి పురుషులందరూ ఏ ప్రమాదానికైనా సిద్ధంగా తయారయ్యారు. సుబ్రహ్మణ్యంగారు మాత్రం జిల్లాలో నాలుగు ప్రాంతాలలోనూ చట్టధిక్కారానికి తగు ఏర్పాట్లు చేయడానికి వెళ్ళారు. ఈ స్థితిలో ముస్తాఫాలీఖాన్ ఆశ్రమాన్ని ముట్టడించాడు. ఆ ముట్టడికి ఆశ్రమ చుట్టుప్రక్కలనున్న గ్రామాల ప్రజలంతా ఉడికి పోయారు. గోదావరి కవతల ప్రక్కనున్న వారంతా కూడా ఆశ్రమంలోనివారు ఏమై పోతున్నారో యని తిండి తిప్పలు లేకుండా ఆవేశపడ్డారు. అప్పట్లో కె. పి. వి. బాలకృష్ణ య్యర్ అనే ఐ. సి. యస్. ఉద్యోగి రాజమండ్రి సబ్‌కలక్టర్‌గా వుండే వాడు, ఆయన కొంత జాతీయాభిమానం గలవాడు; చట్టబద్ధుడు. అలాంటివాడు దగ్గరవుంటే, దౌష్ట్యకృత్యాలు సాగవని ముస్తాఫాలీ రాజమండ్రి తహసిల్దారు మేజిస్ట్రేట్‌ను మాత్రమే తీసుకువెళ్ళాడు. పోలీసు రాజ్యం తాండవిస్తున్న రోజులలో, పోలీసు హెడ్ కానిస్టేబుల్‌కు కూడా మేజిస్ట్రేట్ హడలిపోవలసి వచ్చిందంటే అతిశయోక్తి కాదు.

1932 సం॥ సత్యాగ్రహ సమరంలో ఆంధ్రదేశములోనే కాక, యావత్తు భారత దేశములోనూ చరిత్రప్రసిద్ధిగాంచిన బ్రిటిష్ ప్రభుత్వ పోలీసు దాడులలో సీతానగర ఆశ్రమ దాడి యొకటి.

దేశ రాజకీయ వాతావరణాన్ని, ముందు రాబోయే సత్యాగ్రహ సమరాన్ని దృష్టిలో వుంచుకుని గాంధీజీయొక్క నిర్మాణ కార్యక్రమాన్ని సాగిస్తున్న సంస్థలు, సంస్థలుగా ప్రభుత్వాగ్రహానికి గురియై ఆహుతియైపోయిన నిదర్శనములు వ్రేళ్ళమీద లెక్కకు వస్తాయి. సర్దార్ వల్లభాయి పటేల్‌గారి బార్డోలి ఆశ్రమం, రాజేంద్రప్రసాద్‌గారి సదాఖత్ ఆశ్రమం, యిందుకు మహోజ్జ్వల నిదర్శనములు. ఆట్టికోవకు చెందినదే సుబ్రహ్మణ్యంగారిచే స్థాపింపబడి, నిర్వహింపబడుచువచ్చిన సీతానగరం ఆశ్రమంకూడా. 1931 డిసెంబరులో రెండవ రౌండ్ టేబుల్ సభ భగ్నమయ్యాక గాంధీజి బొంబాయిలో అరెస్టుకాబడగానే కాంగ్రెస్ సంస్థ సత్యాగ్రహ సమరాన్ని ప్రకటించింది, తదుపరి కాంగ్రెస్ అక్రమ సంస్థగా ప్రభుత్వం పేర్కొని అగ్రనాయకులందర్నీ ఒక్కుమ్మడిగా అరెస్టుచేసి తన దమననీతిని యథేచ్ఛగా సాగింప బూనుకొన్నది.

జనవరి 5 వ తేదీ మద్రాస్ ఫోర్టుసెంట్‌జార్జి గెజిట్‌లో సీతానగరం ఆశ్రమం చట్ట విరుద్ధమైన అక్రమ సంస్థగా ప్రకటింపబడింది. దీనికి కొంత కాలంనుండి యెదురుచూస్తున్నా, ప్రకటన వెలువడగానే ఆశ్రమవాసులలోను ఆశ్రమచుట్టుప్రక్కలగ్రామాలలోని ప్రజలలోను ఒక నూతనోత్సాహం, పట్టుదల, కార్యదీక్ష వాటంతటవే బయలుదేరాయి. వెంటనే ఆశ్రమవాసులందరూ కలుసుకుని ముందు కార్యక్రమం గూర్చి ఆలోచింపసాగారు.

అప్పటికి ఆశ్రమంలో ఒక్క క్రొవ్వి డి లింగరాజు తప్ప అందరూ వున్నారు. అన్నపూర్ణయ్య అప్పటికి కొద్దికాలమునకు ముందుగానే విడుదలై ఆశ్రమం చేరుకున్నాడు. లింగరాజు మాత్రం 4, 5 మాసములక్రితం కాంగ్రెస్ పత్రికలోని వీరబలి వ్యాసమునకు 124 ఏ సెక్షన్ క్రింద రెండున్నర సంవత్సరాలు శిక్షపడి జైలులో వున్నారు.

ఆశ్రమవాసుల యెదుటవున్న ప్రశ్న అందరూ ఆశ్రమములోనే వుండి అరెస్టు కాబడడమా ! లేక ఎవరినైనా ఒకరిద్దరిని జిల్లాలోని సత్యాగ్రహ

కార్యక్రమానికి బయటవుంచాలా అన్నదే కొంత తర్జనభర్జన అయిన పిమ్మట సుబ్రహ్మణ్యంగారూ, సాంబమూర్తిగారూ, అప్పటికే లాఠీచార్జి చేయబడి కాకినాడలో అరెస్టుకాబడడంతో జిల్లాలో సత్యాగ్రహం నడిపించ డానికి బైటనే వుండాలని నిర్ణయించడము జరిగింది. యింకొక సమస్య అప్పటికి ఆశ్రమంలోనే వుంటున్న కొందరికి ఆశ్రమవాసుల ముసలి తల్లి దండ్రులను, చంటిపిల్లల తల్లులను, బాలింతలను అక్కడే వుంచడమా అన్నది. జిల్లాలో పోలీసు చర్యలను ముఖ్యంగా రాజమండ్రి డిప్యూటీ పోలీసు సూపరింటెండెంట్ ముస్తాఫాఆలీఖాన్ ఘాతుకచర్యలను గమనించి వారిని బయటకి పంపించి ఆశ్రమవాసులు మాత్రమే ఆశ్రమంలో వుండాలని నిర్ణయంచేసి, వారిని బైటకుపంపించడం జరిగింది. మా యీ పురుషుల నిర్ణ యాన్ని స్త్రీలతరపున అన్నపూర్ణయ్యగారి సతీమణి శ్రీమతి రమణమ్మగారు ప్రతిఘటించారు. మేముకూడా యిక్కడేవుండి మీతోబాటు కష్టసుఖాలను పంచుకుంటామని రమణమ్మగారు అన్నప్పుడామె కోరికను నిరాకరించడం కఠినమనిపించింది. దానితోబాటు బయటవున్నా కుటుంబాలను కనిపెట్టుకొని వుండమని శ్రీ ధరణీప్రగడ శేషగిరిరావును కూడా బయటికి పంపాము. పాపమాయన వెళ్ళనన్నా. మొట్టమొదటినుంచీ ఆశ్రమం మేనేజర్‌గా వున్న కారణంచేత ఆయనకు వెళ్ళక తప్పిందికాదు.

ఇంకా ఆశ్రమంలో మిగిలినవారు 11 మంది. పురుషులు శ్రీయుతులు మద్దూరి అన్నపూర్ణయ్య, రామచంద్రుని వెంకటప్ప, వంగల సత్యనారాయణ, గట్టెం సూర్యనారాయణ, గరిమెళ్ళ నరసింహమూర్తి, వోలేటి నరసింహం. పెద్దాడ గోపాలకృష్ణమూర్తి, డాక్టర్ వంగవేటి వెంకటరామదీక్షితులు, గుండే పూడి రామకృష్ణశర్మ. చండ్రుపట్ల హనుమంతరావు.

5 వ తారీఖు ప్రకటనచూచి ఆశ్రమంపై దాడి 3, 4 రోజులలో జరుగ గలదని, చేసుకోవాల్సిన యేర్పాట్లన్నీ 1, 2 రోజులలోనే పూర్తిచేసు కున్నాం. అయితే పోలీసువారి దాడి 19 వ తేదీనగాని జరుగలేదు. ఈవ్యవధి

భరించడం చాల కష్టమయింది మాకు. ఇది లోని పరిస్థితి. కాని బయటి పరిస్థితి చెప్పనలవికానంత వుత్సాహకరంగావుంది. ఆశ్రమం అక్రమసంస్థగా ప్రకటింపబడిన వార్త పత్రికలలో చదివి చుట్టుపక్కల గ్రామవాసులు వేలాదిమంది ప్రతిరోజూ ఆశ్రమానికి వచ్చి పరామర్శించగలిగిన పెద్దలు పరామర్శించి, చూచుటకు వచ్చినవారు చూచి వెళ్ళుతుండేవారితో ఆశ్రమం చాలా కోలాహలంగావుంది. దగ్గర గ్రామాలనుంచేగాక చాలాదూరాన్నుంచి కూడా వచ్చి చూచి పోతుండేవారు. ప్రతిరోజు యేవేళ చూచినా ఆశ్రమానికి యెదురుగా వున్న గోదావరి యేటిగట్టుమీద 3, 4 ఫర్లాంగులదూరం ప్రజలతొ నిండిపోయి వుండేది. ఆ దృశ్యాన్ని చూస్తూ కాలంగడుపుతున్నా మాలో యింకా పోలీసువాళ్ళు రాలేదే అన్న ఆందోళన, ఆతృత యెప్పటి కప్పుడు హెచ్చిపోతూ వుండేది.

ఎట్టకేలకు 17 వ తేదీ అర్ధరాత్రి వేళకు పోలీసులు మర్నాడు ఉదయం వస్తున్నారనీ, లాంచీలు పడవలు సిద్ధంగా వున్నాయని వార్తవచ్చింది. ఎదురుచూచిన క్షణం దగ్గరయ్యేసరికి ప్రాణం కుదుటపడింది. అందుచేత తెల్లవారేసరికి స్నానాలు, కాలకృత్యాలు తీర్చుకుని 15 మంది చెదరిపోకుండా ఒకేచోట తిష్టవేసి కూర్చున్నాము. వంట ప్రయత్నమే మానేసామని వేరే చెప్పనక్కర్లేదు.

కానీ ఎప్పటికీ రాలేదు. కానీ పన్నెండు గంటలకింకొకకబురువచ్చింది. ఆ రోజుకు రారని, మర్నాడు వస్తారనీ, కారణ మేమంటే 18 వ తేదీ ఉదయం 100 మంది రిజర్వు పోలీసులను వెంటబెట్టుకొని రాదలచిన ముస్తాఫాఅలీఖాన్ ప్రతిరోజూ ఆశ్రమానికి వచ్చిపోతున్న వేలాది జనుల కోలాహలాన్ని తెలుసుకుని ఆశ్రమవాసులను కొట్టి ఆశ్రమం స్వాధీనం చేసుకునే దృశ్యం చూసి ప్రజలు రెచ్చిపోతే, యీ వందమంది రిజర్వు చాలవేమోనని యింకొక వందమందిని పంపించమని కాకినాడ జిల్లాపోలీసుసూపరింటెండెంట్‌ను కోరారని, ఆ అదనపు దళం రావడంకోసమే వాడి మర్నాటికి వాయిదా వేయబడిందని తెల్సింది.

అయితే ఆలీఖాన్ ఘాతుకత్వాన్ని అంతకుముందే యెరిగివున్న జిల్లా సూపరింటెంటు పరిస్థితి పూర్తిగా ఆలీఖాన్‌కే వదలడం యిష్టంలేక తానే స్వయంగా 2 వందల రిజర్వుతోటి 19 వ తేదీ ఉదయం 9 గం॥లకు ఆశ్రమానికి వచ్చాడు.

వచ్చీరావడంతోనే అన్నపూర్ణయ్య నాయకత్వాన మమ్మల్నందర్నీ ఆశ్రమ చతుష్పథంలోకి రమ్మని "The Ashram is declere an unlaurful body by the Government, therefore you are all required to disperse imediately". (ఆశ్రమం అక్రమసంస్థగా ప్రభుత్వం ప్రకటింపబడింది. గనుక మీ రందరూ యిక్కడనుండి వెళ్ళిపోవాలి) అని ఆలీఖాన్ అనగానే అన్నపూర్ణయ్య "The Ashram is our home. We live or die here. Therefore we cannot disperse" (ఆశ్రమం మా యిల్లు; చచ్చినా బ్రతికినా యిక్కడే. అందుచేత మేము బైటకు వెళ్ళము) అని సమాధానమిచ్చారు. వెంటనే జిల్లా సూపరింటెంటు "Charge" అని ఆజ్ఞ జారీచేయగానే చుట్టూ కొంతదూరంలో వలయాకారంగా నిలబడ్డ రిజర్వు ఒక్కుమ్మడిగా పరిగెత్తుకువచ్చి లాఠీలతో బాదడం ప్రారంభించారు. ఆవేళ ఒకరిద్దరి ప్రాణాలవైనా ముస్తాఫా బలిగొనక మానడని మేము అన్నింటికి సిద్ధపడ్డాం.

కానీ సరిగా 5 నిమిషాలకల్లా సూపరింటెండెంట్ "Stop" అని ఆర్డరివ్వడంతో అంతా చల్లబడింది. ఆశ్రమ వాసులంతా క్రిందపడే వున్నారు. అన్నపూర్ణయ్య, దీక్షితులు, కృష్ణమూర్తి, వెంకటప్ప గార్లకు నెత్తిమీద గాయాలుపడి రక్తం కారసాగింది. తక్కినవారందరికీ బాగా కముకు దెబ్బలు తగిలి లేవలేని స్థితిలో వున్నారు. ఎలాగైతే నేమి కొంతసేపటికి మమ్మల్నందర్నీ నడిపించుకుని ఆశ్రమములోని ఆసుపత్రి రోగుల వసతిగృహానికి (Inpatient ward) చేర్చారు. దీక్షితులుగారు డాక్టర్ కాబట్టి తనగాయం నుంచి రక్తం కారుతున్నా ఓర్చుకుని దెబ్బలు తగిలినవారిని ఆసుపత్రికి

తీసుకువెళ్ళి కట్టుకట్టి, తానూ కట్టుకట్టుకుని, పోలీసులు వెంటరాగా వారిని మా దగ్గరకు చెర్చి తానూ చేరాడు. ఎదురుగా ఎత్తుగానున్న యేటిగట్టుమీద నుండి చూస్తున్న జనసమూహాన్ని యెలాగైనా రెచ్చగొట్టాలని పోలీసులు ఒకటి రెండు లాఠీలు వారిపై విసిరారు. కానీ అంతజనం సహనంవహించి ప్రశాంతంగా అలాగే వుండడం సుబ్రహ్మణ్యంగారు ప్రజలలో వ్యాపింప చేసిన అహింసాసిద్ధాంత విజయానికి ఒక ప్రబల నిదర్శనం. అలా మత్తుగా లేవలేక మేమక్కడ యెంతసేపు పడివున్నామో గుర్తులేదు. చివరకు 3గ॥కు వంగలపూడి నుండి నీరుకొండ వెంకటరత్నంగారు భోజనాల కావిడి పంపిస్తే మేము తిని ఆకలి తీర్చుకున్నాం.

మేమిలా లేవలేక అరెస్టయి పడివుంటే ముస్తాఫా అలీఖాన్ మాత్రం తన కార్యక్రమాన్నంతా యధేచ్ఛగా సాగించుకున్నాడు మమ్మలనుక్రిందకు పడగొట్టిన మరుక్షణమే జండాస్థంభం దగ్గరకు వెళ్ళి దాన్ని పడగొట్టి జండా ముక్కముక్కలుగా చింపేశాడు. ఆశ్రమంలో పట్టుకుప్పటం చీరెలు. ధోవతులు, కండువాలు వగైరా నేసే మగ్గాలు, అదనంగా పెద్దపాకలో స్టోర్ చేసిన వందలాది సాదా మగ్గాలు, రాట్నాలు అన్నీ విరగ్గొట్టి ధ్వంసం చేస్తే గాని ఆయన అక్కసు తీరలేదు అంతటితో ఊరుకోక విలువగల ఖద్దరు బట్టలు, ప్రెస్‌లోని కాగితాలు వగైరా ఆశ్రమవాసుల స్వంత సామాను పాడు చేసింది పాడుచేసి, చేజిక్కించుకోగలిగింది చేజిక్కించుకుని ఏదో పట్టీవ్రాసి, కొంత రాజమండ్రి తీసుకెళ్ళి, మిగిలింది ఆశ్రమంలోనే ఒకయింట్లోపెట్టి తాళం వేశాడు.

ఆశ్రమంవంటి ఒక పెద్దసంస్థమీద పోలీసు దాడిచేసి సామాను జాగ్రత్తగా పట్టీతయారుచేసి జాగ్రత్తపర్చడానికి, రాజమండ్రి సబ్ కలక్టర్ శ్రీ బాలకృష్ణయ్యగారు అలీఖాన్‌తో రావడానికి నిరాకరిస్తే, తహసిల్దార్ శ్రీ బెహరాగారు యీ పని సాగించారు.

ఆ రోజు మేమంతా అక్కడే మకాం. రాత్రి భోజనాలులేవు. పోలీసువారుకూడా అక్కడే మకాంపెట్టి చుట్టుప్రక్కల గ్రామాలనుంచి తమకు కావలసిన సామానులు తెప్పించుకొని విందులారగించారు.

మర్నాడు ఉదయం 7 గంటలకే మరల శ్రీ నీరుకొండవారి ఫలహార ఆతిధ్యం. పోలీసులుకూడ పుష్టుగా ఆరగించేక మమ్మల్నందర్ని 200 మంది రిజర్వు పోలీసు వెంటరాగా, వూరేగింపుతో సీతానగరం చతుష్పధానికి తీసుకు వచ్చారు. అక్కడకూడా కాంగ్రెస్ జండా యెగురుతోంది. మమ్మలందర్నీ వరుసగా నిలబెట్టి ముస్తాఫా ఆలీఖాన్ మాత్రం జండాదగ్గరకు వెళ్ళి, "ఈ జండా లాగేస్తున్నాను, మీలో దీనికి అడ్డుకునేవారు యెవరైనావుంటేరండ"ని ప్రజా సమూహాన్ని సవాల్ చేశాడు. అంతా నిశ్శబ్దం.

కానీ చడీ చప్పుడు లేకుండా ఏమూలనుంచో మెల్లిగా అడుగులు వేసుకుంటూ 70, 75 యేళ్ళ వృద్ధుడు, పొట్టిగా బక్కపల్చగా వుండే శ్రీగుత్తి సుబ్బరాజుగారు "నే నెదుర్కొంటున్నాను" అనే సరికి అక్కడ జేరిన రెండు వేల జనుల గుండెల్లోనూ, అదటుబయలుదేరి సుబ్బరాజు మరణం ఖాయం అనుకున్నాం. ఏ కళనున్నాడో, ముస్తాఫా జిల్లా సూపరింటెండెంట్ దగ్గరవుండటంచేత కాబోలు కొంచెం నిదానించాడు. జరిగి పోతున్న కార్యక్రమాన్ని పై ఆంగ్లేయాధికారి సమక్షంలో ధ్వంసం చేయడానికి జడిసో, మొత్తంమీద సుబ్బరాజుమీద చేయిచేసుకోకుండా అరెస్టు చేశాడు. ఇక మే మందరమూ సుబ్బరాజుతో సహా లాంచీ దగ్గరకు ప్రయాణం చేశాం.

పోలీసు లాంచీలు రెండువందలమంది రిజర్వును, ఆశ్రమవాసులను సుబ్బరాజును యెక్కించుకొని సుమారు 11 గంటలకు సీతానగరం రేవులో బయలుదేరి సాయంత్రం 4 గంటలకు రాజమండ్రి చేరుకున్నాం. ఇంతమంది సాయుధరిజర్వుతో మేము 12 మందిమి రేవులో దిగగానే జనం గుంపులు గుంపులుగా చేరి దూరాన్నుంచే తిలకిస్తూ మాతోకూడా గోదావరి స్టేషన్

దగ్గరవున్న రిజర్వు పోలీసు సబ్ స్టేషన్ వద్దకు అనుసరించారు. మా కక్కడ మకాం రాగానే ఆలీఖాన్ హెడ్ కానిస్టేబులును పిలిచి మాకు భోజనం యేర్పాట్లు చేయమన్నారు. అతడు రాజమండ్రిలోని అన్నివర్గములలోను పరిచయం కలవాడగుటచే దగ్గరలో నున్న దామోదరరావుగారి హోటల్ కు వెళ్ళి చెప్పగానే, వెంటనే ఆయన అన్నం బండితో యిద్దరు కుర్రాళ్ళను వెంటబెట్టుకుని స్వయంగావచ్చి భోజనాలు వడ్డించాడు. ఆ రోజులలో స్టేషనుకు దగ్గరగా వుండటంచేత దామోదరరావు, పట్టణం మధ్యగా వుండటంచేత వరదరావు సోదరుల ఆతిధ్యం కాంగ్రెసు వారందరికీ లభిస్తూవుండేది. ఆ రాత్రినుండి మా అందరికి తాలూకా ఆఫీసు దగ్గరున్న సబ్ జైలులో శిక్ష పడేదాక సుమారు ఒక నెలరోజులపాటు నిర్బంధం.

మర్నాడు ఉదయం మేము కాలకృత్యాలుతీర్చుకోకుండానే 6 గంటలకల్లా వరదరావుగారు టిఫెన్లు, కాఫీలతో సబ్ జైలుకు వచ్చి ఖైదీలకు యిస్తానంటే, అక్కడి అధికారియైన హెడ్ కానిస్టేబులు సబ్ జైలు సూపరింటెండెంటు అయిన సబ్ మేజిస్ట్రేటుగారు అనుమతి యిస్తేగాని వల్లకాదన్నాడు. ఆయన 11 గంటలకుగాని ఆఫీసుకురాడు. అంతవరకు టిఫిన్లు వేళ ఆగుతుందా ! చివరికి యెలాగైతేనేం ఆ పూటకి కానిమ్మని అనుమతి లభించింది. మధ్యాహ్నం భోజనాల కావిడితో వరదరావుగారు వచ్చి అనుమతి పొంది మాకు వడ్డించారు. తిరిగి వెళ్ళిపోతూ మేజిస్ట్రేట్ గారితో యీ రిమాండుకాలంలో ప్రతిరోజు రెండు పూట్లా భోజనం, కాఫీలు వగైరాలు సప్లయి చేస్తానని అనుమతి పొంది వెళ్ళాడు. 3 గంటలకు కాఫీ టిఫిన్లు వస్తే ఛాందసుడైన మేజిస్ట్రేటు శ్రీ పప్పు మల్లిఖార్జునరావు టిఫిన్లకు అనుమతించక కాఫీ మాత్రమే యివ్వనిచ్చారు. ఇలాగ సుమారు నెలరోజులు శ్రీ వరదరావుగారి ఆతిధ్యసత్కారాలతో, ఏవో లభ్యమైన కొన్ని గ్రంధాలు చదువుకుంటూ రోజులు తేలికగానే గడిపేము.

కానీ పట్టణం మాత్రం అట్టుడికినట్లు వుడికిపోతుంది. ఎక్కడ చూసినా ముస్తాఫాఅలీఖాన్ స్వైర్యవిహారం తాండవిస్తోంది. కాంగ్రెస్ఆఫీసులే

గాక, కాంగ్రెస్‌కు సంబంధం వుందన్న ప్రతి సంస్థమీదికి దాడి వెడలి అక్కడ వారిని చిదకదన్ని ఆ సంస్థలను స్వాధీనం చేసుకునేవాడు. ఒక రోజున జిల్లాలోని అగ్రనాయకులైన శ్రీ పెన్నేటి సత్యనారాయణరావు గారూ, సామవేదం అచ్యుతరామయ్యగారు ఖద్దరుమూటలను నెత్తినబెట్టుకుని పట్టణ వీధులలో హాకింగ్‌కు బయలుదేరితే అలీఖాన్ వారిని అపుచేసి లాఠీలతో మోది మూటలు స్వాధీనం చేసుకుని వారిద్దరిని నిర్బంధంలోనికి తీసుకున్నాడు. ప్రత్యక్షంగా సత్యాగ్రహంచేసి ప్రభుత్వాన్నెదిరించక ప్రశాంతంగా ఖద్దరు గుడ్డలు అమ్ముతున్న వారిని కొట్టి అరెస్టుచేయడం చాలా ఘోరం. పౌరసత్వ హక్కులకు, సామాన్య పౌరజీవితానికి సహింపరాని అటంకం. ఈ అవమానాన్ని సహింపలేక, యీ దుర్భర పరిస్థితులను అదుపులో పెట్టాలని రాజమండ్రిలోని పెద్దలు శ్రీ న్యాపతి సుబ్బారావుగారి నాయకత్వాన సబ్‌కలక్టర్ శ్రీ బాలకృష్ణయ్యర్ వద్దకు రాయబారం వెళ్ళారు. శ్రీ బాలకృష్ణయ్య ఐ. సి. యస్. ఆఫీసర్ మాత్రమేగాక, న్యాయాన్యాయములను కొంత విచక్షణతో స్వతంత్రంగా విచారించగల దక్షుడుకూడా ! అందుచేత ఆయనంటే ప్రజలలో కొంత గౌరవ విశ్వాసాలు వుండేవి. పోలీసులకు కొంత జంకువుండేది. లేకపోతే అలీఖాన్ ముష్కరత్వానికి యింకా అంతు వుండేదికాదు.

జిల్లా అంతటా సత్యాగ్రహాన్ని సాగించే యేర్పాట్లను చేయడానికి జిల్లాను చుట్టివచ్చిన డా॥ సుబ్రహ్మణ్యంగారు, సబ్‌జైలులోనున్న మమ్మల్ని చూచి కీ. శే, నాళం భీమరాజు యింట్లో భోజనం చేసి విశ్రాంతి తీసుకుంటుండగా, ఆ సంగతి ముస్తాఫాలీ తెలుసుకున్నాడు. ఆయనెప్పుడు దొరుకుతాడా యని వేచియున్న ఖాన్‌సాహెబ్ రిజర్వుపోలీసులతో భీమరాజు యింటికి వచ్చి సుబ్రహ్మణ్యంగార్ని, భీమరాజుగార్ని బయటకి రమ్మని పిలిచి వారు రాగానే "You coward ! You are hiding here I have been looking for you for some time, Come on !" అని అంటూ సుబ్రహ్మణ్యంగార్ని, భీమరాజుగార్ని క్రిందకులాగి తాను కొట్టడమేకాకుండా

పోలీసులచేత స్పృహ తప్పిపోయేవరకు కొట్టించాడు. సైడు కాలువలో పడేసి కొట్టడం, పైకిలాగి మళ్ళీకొట్టడం, యీ విధంగా రాక్షసత్వాన్ని ప్రదర్శించాడు. ఆ దెబ్బలవల్లనే ఆయన ప్రక్క ఎముక విరిగింది. తర్వాత ఆయనను అరెస్టుచేసి రాజమండ్రి హాస్పిటల్‌లో చికిత్సలోవుంచి పిమ్మట ఆయన కొందరితోకలసి కుట్ర చేస్తున్నట్లు ఆ మాటలు తాను తలుపు చాటునుండి విన్నట్లు ఒక శుద్ధ అబద్ధపు కేసును బనాయించాడు. ఆ కేసు రాజమండ్రి జాయింట్ మేజిస్ట్రేటు శ్రీ బాలకృష్ణయ్యరు ఎదుట నడిచింది. ఆ కేసులో డిఫెన్సు పెట్టటానికి పెద్దలైన వారెందరో సుబ్రహ్మణ్యంగార్ని బలవంత పెట్టగా, ఆయన అంగీకరించాడు.

పెద్దలైన లాయర్లంతా ఆయనకు తోడ్పడ్డారు. హోతా వీరభద్రరావు వంటి ప్రముఖులు ఆయన తరపున సాక్ష్యమిచ్చారు. వాస్తవాన్ని గమనించిన బాలకృష్ణయ్యర్‌గారు కేసును కొట్టివేసి ఆయనను విడుదలచేశారు. కాని వెంటనే అమలాపురంలో ఇచ్చిన వుపన్యాసానికి అమలాపురం ఆర్.డి.వో గ్రబ్ అనే ఆయన 6 నెలలు శిక్ష విధించి అనారోగ్యస్థితిలో ఆయన కవసర మైన విశ్రాంతిని కలుగ చేశాడు. కానీ చివరకు ఆ దెబ్బలవలననే ఆయన క్షయవ్యాధికి గురియై మరణించాడు. బాలకృష్ణయ్య తీర్పుమీద ముస్తాఫా అప్పీలు చేయడానికి చాలా తంటాలు పడ్డాడు. కానీ ప్రభుత్వం బాగా తెలివిగా ప్రవర్తించి అంతటితో ఆగిపోయింది. ఈ కేసులను నడిపించడంలో కీ॥ శే॥ శ్రీ దేవత శ్రీరామ్మూర్తిగారు, మద్దూరి శివరామకృష్ణయ్య ప్రభృతులు పూర్తి బాధ్యత వహించారు. ఆ సందర్భంలోనే జాతీయ జండాను యెగురవేసే హక్కును ప్రతిష్ఠించిన శ్రీరామ్మూర్తిగారు చిరస్మరణీయుడు. జండా కనుపిస్తే చించిపారేసే ముస్తాఫాలీఖాన్‌కు మెయిన్ రోడ్డులో శ్రీరామ్మూర్తిగారి మేడమీద జండా కంటకంగా కనుపించింది. దానిని చూస్తే రాజభక్తులకు బాధకలిగి శాంతి భద్రతలకు ముప్పుకలుగుతుందనే మిషతో 144 వ సెక్షన్ క్రింద దానిని తీసివేయమని నోటీసు యిప్పించాడు. దానిని శ్రీరామ్మూర్తిగారు ప్రతిఘటించినా సబ్ మేజిస్ట్రేటు యెదుట ప్రయోజనం

లేకపోయింది. దానిపై హైకోర్టుకు వెళ్ళగా అక్కడ జండామెగురవేసుకునే హక్కు పౌరులకు లభించింది.

ఈ విషయాలన్నీ చెవుల్లో పడుతున్నా, మొత్తంమీద మాకేమీ పట్టనట్లే రోజులు దొర్లిపోతున్నాయి. నెల అయింది. కేసంటూ మామీద యింకా యేమీ పెట్టలేదు. పార్సిక్యూషన్ తీసుకురారేమని ఒకటి రెండుసార్లు హెచ్చరించిన బాలకృష్ణయ్యర్‌గారి బాధపడలేక అక్రమసంఘమైన ఆశ్రమ సభ్యులమన్న కేసుకు యెంతకూ తుదా మొదలు తెలక; ఏదో తాత్కాలికమైన కేసు పెట్టి కొద్దిగానైనా శిక్ష వేయించి సెంట్రల్ జైలుకు పంపేస్తే, తరువాత తాపీగా పెద్దకేసు బనాయించవచ్చునని, మేము సీతానగరంలోని కల్లుసారాయి దుకాణంవద్ద పికెటింగ్ చేశామన్న ఒకకేసు కల్పించి పెట్టబడింది. రిమాండ్ పొడిగించమని ఒకసారి సబ్‌కలక్టర్‌గారి ముందు హాజరుపెట్టగా మేమూ మా సంగతి కొంచెం త్వరగా తేల్చమని (Expedite) అడిగాము, సబ్‌కలక్టర్‌గారు "As expendith only as justice can permit' (న్యాయశాస్త్ర ప్రకారము ఎంత త్వరగా వీలుపడితే అంత తొందరగా చేస్తానని) సమాధానం చెప్పేరు. మేము మా పికెటింగ్ కేసు వాఙ్మూలములో మేము సామాన్యంగా పికెటింగ్ చేస్తూనే వుండేవారముగాని, కేసుపెట్టిన రోజున మాత్రము చేయలేదని చెప్పాము. మేజిస్ట్రేటు గారేమనుకున్నారో యేమో వెంటనే చిరునవ్వు నవ్వుతూ "ఆ మాత్రం ఫర్వాలేదు. మీరు నేరమంగీకరిస్తున్నారు గనుక మీకు ఆరునెలల కఠినశిక్ష". అని తీర్పుయిచ్చారు. సబ్‌జైలు జీవితంతో బాగా విసిగిపోయిన మాకు యిదెంతోహాయి అనిపించింది. ఆ రోజు 3 గంటలకే సెంట్రల్ జైలులో ప్రవేశించాము.

చివరకెలాగైతేనేం యింకొక నెలకి మా మీద ఒక ఆరడజను సెక్షన్‌ను మోపి ఒక పెద్దకేసు పెట్టబడింది. తాను తలచిన ప్రకారం పంచప్రాణి చావదన్నినట్లు మమ్ముకూడ కొట్టలేదన్న అక్కసుతో మాకు శిక్ష యెక్కువ వేయించి తీర్చుకోవాలని ముస్తాఫా అలీఖాన్ ప్రయత్నించాడు.

అందుచేత రాజమండ్రి జాయింట్ మేజిస్ట్రేటు కోర్టులో పెడితే నిలబడదనో లేక యేదో తేలికగా తేల్చిపారేస్తారనో అక్కడ కాకుండా మమ్మలను విచారించుటకు ఏక స్పెషల్ కోర్టు యేర్పాటుచేయించి. దానికి పెద్దాపురం డిప్యూటీ కలక్టరైన శ్రీ గణపతిరావుగార్ని మేజిస్ట్రేటుగా నియమించడం జరిగింది. ఆ కేసు రెండు మూడు రోజులు జరిపించి మొత్తంమీద మా అందరికి నాలుగేసిఏళ్ళు వడ్డించారు 1929 లో "చిచ్చుల పిడుగు" అన్న వ్యాసం వ్రాసిన రామచంద్రుని వెంకటప్పమీద అప్పటికేమీ చేయడానికి వీలులేక. యిప్పుడు దొరికాడు కదాయని యింకో సెక్షన్ అదనంగా తగిలించి. ఆయన కింకొక సంవత్సరం అదనంగా, అనగా మొత్తం మీద అయిదేళ్ళ శిక్ష విధించారు. ఇంత దీర్ఘ శిక్ష మద్రాసు రాష్ట్రంలో యింకెక్కడా ఎవరికీ పడలేదు. ఆ గౌరవం మాకే దక్కిందని గర్వపడ్డాము. మా కిచ్చింది 'సి' క్లాసని వేరే చెప్పనక్కర్లేదు. అందుచేత నాలుగేళ్ళదాకా రాజమండ్రి సెంట్రల్ జైలులో వుంటాము కదాయని స్థిరపర్చుకుంటే. శిక్ష పడ్డ వారం పది రోజులకు ఒక అర్థరాత్రి వేళ లేపి లారీమీద రాజమండ్రి స్టేషన్‌కు చేర్చి. బళ్ళారి సెంట్రల్ జైలుకు మమ్మల్నందర్ని కమానుకట్టేరు (జైలుభాషలో కమాను అంటే ట్రాన్స్‌ఫర్).

శ్రీ సుబ్రహ్మణ్యంగారు కదలూరుక్యాంపు. తక్కిన ఆశ్రమవాసులు వెల్లిదెస్సిలోని జైళ్ళలోను ప్రవేశించి కాలం గడుపుతున్నారు. ఆశ్రమం మీద ముస్తాఫాలీ చేసిన దౌర్జన్యాలను గమనించిన ప్రజలు భయాన్ని వదలి, సత్యాగ్రహానికి విజృంభించారు. ఆశ్రమం చుట్టుప్రక్కల గ్రామాలనుండి సామాన్యులైన కుటుంబాలలోని యువకులు, వృద్ధులు ఈతగెలలు కోసి. తదితర విధాలైన సత్యాగ్రహాలు సాగించి జైళ్ళకు వచ్చారు.

ఈ రచయిత కన్ననూరు జైలులో వుండగా, క్వారంటైన్ నుండి నాకు పోస్టుమాస్టరు వచ్చాడని కబురందింది. సీతానగరంలో ఉపాధ్యాయ వృత్తితో బాటు పోస్టుమాస్టరు చేసే శ్రీ చట్టి కృష్ణయ్య పంతులు ఆయన

కుటుంబస్థితిచాలా కష్టస్థితిలో వుండగాకూడ జైలుకొచ్చేడంటే ఎంతమంది సామాన్య జనం ఆ వుద్యమంలో దూకేరో వూహించుకోవలసిందే. 18నెలలు శిక్షననుభవించి జీవితాన్ని గడపడానికి కటకటలాడి అతడు మరణించాడు. స్వరాజ్యం వచ్చేక అతని కుటుంబానికి జరిగిన సహాయం, గుర్తింపు సున్న. గుత్తి సుబ్బరాజు భార్య కింత వుపాధి కల్పించలేని స్వాతంత్ర్యానంతర పరిపాలకులను గురించి తలచుకుంటే వారెంత కృతఘ్నతా దోషానికి గురి అవుతున్నారో అర్థమవుతుంది. నేటి మన స్వాతంత్ర్యానికి కారణభూతులైన అలాంటి అజ్ఞాత వీరులను గుర్తించలేని "కాంగ్రెస్" ప్రభుత్వంనీరసస్థితిలో పడిందంటే ఆశ్చర్యమేమున్నది ?

ఆశ్రమంలోని పురుషులంతా జైళ్ళకువెళ్ళిన పిమ్మట మద్దూరి అన్న పూర్ణయ్య భార్య శ్రీమతి రమణమ్మగారు, మానాప్రగడ కృష్ణారావు భార్య సుందరమ్మగారు పికెటింగులో పాల్గొని జైళ్ళకొచ్చేశారు. మిగిలినవారు తమకు వీలైనచోట తలదాచుకున్నారు.

నా తలిదండ్రులు బాగా వృద్ధులు కావడంచేత వారికొక ఆశ్రయం కావలసి వచ్చింది. రాజమండ్రిలో వారికొక అద్దెఇల్లు దొరకడం కష్టమైంది. వారికి ఇల్లిస్తే ముస్తాఫాలీ కొంపమీద పడతాడేమోనని భయపడిపోయారు.

చివరకు చిన్న ప్రభుత్వ ఉద్యోగం చేస్తున్న నా చినబావమరిది సాహసం చేసి ములకల్లంక గ్రామంలో వారి కాశ్రయ మిచ్చాడు. పై అధి కారులీవిషయమై ఆయనను ప్రశ్నించినపుడు ఆయన ధైర్యంగా "నాకాయన మామగారేకాదు తాతగారుకూడ! పైగా ఆయన ఆశ్రయంలోనే నేను చదువు కుని వృద్ధిలో కొచ్చాను కనుక ఆయనకు నేనాశ్రయమివ్వక తప్పదన్నాడు." అంతకన్న ఆయన కేమీ ప్రమాదం రాలేదు.

ఆశ్రమ ఆస్తులను స్వాధీన పరచుకునేటప్పుడు మా ఎడ్లు పోలీసుల కొక సమస్యయైనాయి. ఒంగోలుజాతి తెల్లని ఎడ్లను మేము చాలా ఆప్యా యతతో పెంచాము. అవి అందంగా చూడముచ్చటగా ఉండేవి, గోదావరి

రేవులోకి మా బండి వచ్చినప్పుడు లాంచి సరంగులు ఆనందంగా "మీ మోటారు కారొచ్చింది" అని అంటూ ఉండేవారు. ఆశ్రమంనుండి గోదావరి తిప్పలమీద గాంధీజీని లాంచిరేవుకు తీసుకెళ్ళిన బండీ ఎడ్లూ మా కెంతో పవిత్రము అయినవిగా ఉండేవి. వాటి ఖరీదు ఆరోజులో రు. 1200-00 లు. వాటిని 300 రూపాయలకు పోలీసులు అమ్మేశారు.

అలాగే మా ప్రెస్సును కూడా అమ్మేయడానికి రాజమండ్రి తీసుకు వెళుతుండే స్టీమరు తిప్పపట్టి దానిని కదిలించడానికి కొన్నివేలుగవర్నమెంటుకు ఖర్చయినాయి. చివరకు ప్రెస్సు తాలూకు క్రెడిట్‌నుమాత్రం రు 300 లకు రాజమండ్రిలో ప్రభుత్వం వారు అమ్మేశారు.

మా ఆశ్రమవాసులు స్వంత సామానులను చాలావరకు అధికారులు స్వంతం చేసుకున్నారు. వారికక్కరలేనివి విరగొట్టేరు. అంతటితో పోలీసు దురాగతం ఆగింది. ఆశ్రమాన్ని తిరిగి అప్పచెప్పేవరకూ అందులో పోలీసు కాపలా మాత్రం ఉండేది.

ఆశ్రమం తాలూకు ఆస్తిపాస్తులను సరియైన మేనేజిమెంటుకు వప్ప జెప్పడానికీ కుటుంబాల అవసరాలను అందివ్వడానికీ వెనుకనుంచబడిన ధరణీ ప్రగడ శేషగిరిరావుకూడా కొద్దికాలానికే మద్రాసులో అరెస్టయి ఆరుమాసములు శిక్షపడి కొంతకాలం మద్రాసు జైలులోను, పిమ్మట మధురలోనూ కాలం గడిపేడు.

1932 సం॥రం సుబ్రహ్మణ్యంగారికి ఆరు మాసాలు మాత్రమే శిక్ష పడడంచేత అక్టోబరు నవంబరు నాటికి ఆయన విడుదలై యింటికొచ్చారు. అప్పటికి ఆశ్రమం ప్రభుత్వ స్వాధీనంలోనే ఉన్నది. అప్పుడే గాంధీజీ హరిజన్ సమస్య మీద ఉపవాసదీక్ష పూనడంవల్ల దేశమంతా అందోళిత స్థితిలో ఉండినది. సుబ్రహ్మణ్యంగారు స్థానికంగా హరిజన్ సమస్యపై నిర్మాణాత్మక కృషిచేయడానికి సీతానగరం ఊళ్ళోనే దేవాలయాల సమీపంలో సుమారొక యెకరం నేలలో హరిజనాశ్రమమంటూ

ఒక నిర్మాణాన్ని తయారుచేశారు. చక్కని మామిడి తోటలో చతుష్పథం చుట్టూ పాకలు నిర్మాణంచేసి అక్కడ ఆస్పత్రిని నెలకొల్పి, పెద్దఆశ్రమంలో వుండే కార్యక్రమాలను చిన్న స్థాయిలో ప్రారంభించారు. ఆయనకు చిర్రాపూరి మాధవరావనే యువకుడు వైద్యంలో సహాయపడేవాడు. ఆ తోట అతడిదే. హరిజనాశ్రమంలో పాకలు తయారవడంతోనే సుబ్రహ్మణ్యం గారు ముందుగా ములకలంకలోనున్న మా తండ్రిగారిదగ్గరకెళ్ళి నేను జైలు నుండి తిరిగి వచ్చేవరకూ వారి భారము తనదేననీ, కనుక తనతో పాకల్లో నివాసానికి రమ్మనీ కోరేరు. మా తలిదండ్రులకక్కడ లోటు ఏమీ లేక పోయినా, ఆయన మాట కాదనలేక వెంటనే వెళ్ళిపోయారు.

హరిజనాశ్రమం మా రెండు కుటుంబాలతో ప్రారంభమై క్రమ క్రమంగా విడుదలై వచ్చిన వారి కాశ్రియమైనది. సుబ్రహ్మణ్యంగారు ప్రజాహిత కార్యాలకు నిధులను వసూలు చేయడంలో గొప్ప ప్రజ్ఞాశాలి. ఉభయగోదావరి జిల్లాలలో ఆయన కావాలని కోరితే నిరాకరించిన వారు లేరంటే అతిశయోక్తికాదు. దేవత శ్రీరామమూర్తిగారున్నూ, మద్దూరి శివరామకృష్ణయ్యగారు ఆయనతో - తిరిగి అతిశీఘ్రకాలంలో కొత్త ఆశ్రమ నిర్మాణానికే కాకుండా హరిజన కార్యక్రమాలకుకూడా కావలసిన ధనాన్ని సేకరించారు.

1933 సం॥రం ఆగష్టునాటికి సత్యాగ్రహోద్యమం కొంత శాంతిం చింది. 1935 సం॥రం ఇండియా గవర్నమెంటు చిత్తు చట్టం తయారైంది. ఆ సంస్కరణ కాదరణ కలగాలనే ఉద్దేశ్యంతో ప్రభుత్వదృష్టితో అంత ప్రమాదమైన వ్యక్తులు కారన్న వారిని ప్రభుత్వం విడుదల చేయడం మొదలుపెట్టింది. అన్నపూర్ణయ్య, వెంకటప్ప చండ్రపట్ల హనుమంతరావు తప్ప మిగిలిన వారందరిని 1933 సం॥రం నవంబరు నాటికి వాళ్ళశిక్ష పూర్తి కాకుండానే విడుదలచేశారు. నేను 2¼ సంవత్సరాలశిక్ష పూర్తియై కోయం బత్తూరు జైలునుండి నవంబరు మొదటి వారంలో విడుదలైనాను. నాతో

పాటు గుండేపూడి రామకృష్ణశర్మకూడా విడుదలైనాడు. మేమిద్దరం వెల్లూరు జైలులో సాంబమూర్తిగారిని దర్శించి, తిరుపతి వేంకటేశ్వరుని దర్శనం చేసి మద్రాసు మీదుగా ఇంటికి చేరుకున్నాం. మేము ఇంటికి చేరుకునేసరికి ఆశ్రమాన్ని తిరిగి మాకు స్వాధీనంచేస్తూ ప్రభుత్వం ఉత్తర్వులను జారీ చేసింది. త్వరత్వరగా మరమత్తులు చేయించి డిసెంబరు మొదటి వారంలో శాస్త్రీయంగా పుణ్యాహవాచనం చేయించి ప్రవేశించాము. ఆశ్రమం మీద ఆంక్షలు తొలగిపోయినా, నా మీద పోలీసునిఘా మాత్రం చాలా తీవ్ర మైంది. ఇల్లుకదిలితే కూడా పోలీసువాళ్ళు లేకుండా కదలడం సాధ్యమయేది కాదు. కాని వాళ్ళవల్ల మాకు ప్రతిబంధకమేమీ ఉండేదికాదు. ప్రయాణాల్లో మా సామాను జాగ్రత్త పరచడం, రైలు టిక్కట్లు కొనడం, పిల్లల నాడించ డంతో ఇత్యాదిసౌకర్యాలన్నీ చేస్తూవుండేవారు. ఇపుడు మంత్రులతో గన్‌మెన్‌లున్నట్లే వాళ్లూ మాకు రక్షణగా ఉండేవాళ్లు. అందుకు కారణం- మాకురహస్య వ్యవహారం లేకపోవడం. వాళ్ళమీద ఏ విధమైన ద్వేషం, చిరాకు లేకపోవడం.

ఆశ్రమం స్వాధీనమైన కొద్దిరోజులకే గాంధీజీ ఆంధ్రలో హరిజన యాత్ర ప్రారంభించాడు. యధాప్రకారంగానే ఆశ్రమంలో ఆయనకు రెండు రోజులు విశ్రాంతి యేర్పాటు చేయడమైంది. ఆశ్రమం ప్రభుత్వ వశంలో వున్నప్పుడు వివిధప్రాంతాలలో బంధువుల ఆశ్రయంలో వున్న స్త్రీ జనాన్నం దర్నీ గాంధీజీ రాక సందర్భంగా ఆశ్రమానికి రావించాలని అనుకున్నాం. రామచంద్రుని వెంకటప్ప భార్య పుట్టింట అమ్మనబ్రోలు స్టేషన్‌కు 10 మైళ్ళ దూరంలోనున్న యేదో గ్రామంలో వుండేది. ఆమెను తీసుకురావడానికి నేను మెయిల్‌లో ఒంగోలు బయల్దేరాను. అప్పట్లో యిష్టమొచ్చినట్లు తిరిగే 10 రూపాయల బైరాగి టిక్కట్లు అమలులో వున్నాయి. గాంధీజీరాకముందు 4, 5 రోజుల క్రితం వెల్లింగ్‌డన్ ప్రభువు మద్రాసునుంచి కలకత్తాకు ప్రత్యేక రైలులో ప్రయాణంచేస్తున్నాడు. ఆ కారణంచేత నా మీద నిఘా మరింత ఎక్కువైంది. ఒక జవానుకు బదులు యిద్దరు జవానులు కాపలా.

ఈ స్థితిలో నేను ముందు రైలులో దిగి గోదావరి స్టేషన్‌లో మా బావగారి యింట్లో భోజనం చేసి వచ్చేసరికి మెయిల్ స్టేషన్‌లోకి వచ్చింది.

అందుచేత వెనకవైపు నుంచి వచ్చి టిక్కెట్టు కొనుక్కునే బాధ లేక పోవడంచేత రైలెక్కి జనసమూహంలో కలసిపోయాను. ప్లాటుఫారం మీద నా కోసం వేచియున్న సి. ఐ. డి. కానిస్టేబుల్‌కు గుండెల్లో రైళ్ళు పరిగెత్తాయి. 15 నిముషాలపాటు మెయిలును ఆపు చేశారు. కాని నన్ను గుర్తుపట్టలేక పోయారు, చలిచేత శాలువా కప్పుకున్న కారణం వల్ల నన్ను హడావుడిలో ఆనవాలు పట్టలేక పోయారు. రైలు ఆగినప్పుడల్లా యిద్దరు జవానులు కంగారుగా రైలంతా వెదుకుతుండేవారు. రైలు నాపమని పోలీసులు, ఆపడానికి వీల్లేదని రైల్వే వాళ్ళు ఘర్షణ పడుతుండేవారు, ఇదంతా గమనిస్తున్న నాకు జాలీ, నవ్వూ వచ్చేవి.

చివరకు బెజవాడదాకా వచ్చిన రాజమండ్రి జవాను బెజవాడ స్టేషన్‌లో అక్కడి స్పెషల్ బ్రాంచి వారికి యీ పని అప్పజెప్పి పోయాడు. బెజవాడ నుండి దాదాపు మెయిలు ఆగే చోట్లన్నిటికి టెలిగ్రాంలు అందినాయి. పొడుగు, రంగు మొదలైన వివరాలన్నీ తెలియచేయబడ్డాయి. కానీ ఎవ్వరూ గుర్తుపట్టలేక పోయారు. నేను ఒంగోలు స్టేషన్‌లో అర్థరాత్రి దిగాను. తెల్లవారగట్ల పాసెంజరులో అమ్మనబ్రోలు దగ్గరున్న వూరు వెళ్ళాలి కనుక నేను రెండు మూడు గంటల కాలక్షేపం కోసం ఒక బెంచిమీద పడుకున్నాను. పోలీసుల కెందుకో అనుమానం కలిగింది. నా దగ్గరకొచ్చి గుసగుసలాడటమే కాని పలకరించడానికి యెవ్వరూ సాహసించలేదు. చివరకొక హెడ్ కానిస్టేబులు, చాల మర్యాదగా నన్ను లేపి నమస్కారం చేసి "అయ్యా! మీ పేరు క్రొవ్విడి లింగరాజు గారేమో చెప్పండి. ఆయన కోసం మేము వెతుకుతున్నాం. మమ్మల్ని బాధపెడితే మీకేమి ప్రయోజనం లేదుకదా!" అని దీనంగా అడిగేడు. నాకు నవ్వొచ్చింది. మనకేమీ రహస్యంలేదు కనుక అవు నన్నాను. వాళ్ళ మొగాలు విప్పారినాయి. నా కార్యక్రమ మేమిటో చెప్పాను.

అందుమీద "అయ్యో! యీ చలిలో యిక్కడెందుకు తమరు బాధపడటం? మా స్టేషనులో మీకు పక్క యేర్పాటు చేస్తా"మని స్టేషన్‌లో నాకు వసతి యేర్పాటు చేశారు. రైలు వేళకు లేపి కాఫీ వగైరాలను యిప్పించి, అమ్మన్న బ్రోలుకు తీసుకెళ్ళి అక్కడ గుర్రపుబండినెక్కించి తానుకూడ నాతోవచ్చాడు. ఆ మర్నాడు కాని నాకు తిరుగు ప్రయాణం కుదరలేదు. అంతవరకు అక్కడే వుండి మర్నాడు రైలులో నన్ను జాగ్రత్తగా యెక్కించి శలవుతీసుకున్నాడు. రాజమండ్రి చేరేసరికి నా వసతి గృహంలో పోలీసు కాపలా వున్నారు. ఈ రభసయెందుకయ్యా అంటే వెల్లింగ్టన్ ప్రభువు ప్రాణ రక్షణకు విప్లవకారులైన వారి దేశభక్తిని ప్రశంసిస్తూ వ్రాసిన వ్యాసానికి. ఆనాటి ప్రభుత్వం పిస్టల్ చేతితో ఎన్నడూ ముట్టని నాబోటి గాళ్ళను చూచి కూడా కంగారు పడేదని చెప్పడానికి సందర్భం కాకపోయినా యీ కథను వ్రాసాను.

డిశంబర్ 3వ తేదీయని నా జ్ఞాపకం. గాంధీజి రెండవసారి మా ఆశ్రమంలో అడుగుపెట్టారు. విశ్రాంతి తీసుకున్నాక ఆయన హరిజన ప్రచారం కోసం ధనాన్ని వసూలు చేశాడు. ఒకసారి ఆశ్రమాన్ని పోలీసులేవిధంగా పాడు చేశారో చూద్దామని బయలుదేరాడు. సుబ్రహ్మణ్యంగారు తక్కిన వారు వెంటనున్నారు. విరుగ కొట్టబడి గుట్టగా వున్న మగ్గాలను చూసేసరికి ఆయన హృదయం ఆర్ద్రమైపోయింది. రెండు మూడు నిమిషాలు నోటమాట రాలేదు. ఆఖరుకు నిట్టూర్పు విడిచి 'సుబ్రహ్మణ్యం! గవర్నమెంటు మీద దావా ఎందుకు వెయ్యకూడదు?' అన్నారు. సుబ్రహ్మణ్యంగారు 'మీ అనుజ్ఞ అయితే అలాగే చేస్తా'నన్నారు. అందుమీద గాంధీజి చాల బిగ్గరగా 'తప్పకుండా చెయ్యి' అన్నారు.

గాంధీజి వచ్చివెళ్ళిన తర్వాత మేము చేయవలసిన పనేమిటో తెలియక అగమ్య స్థితిలో కొంతకాలమున్నాం. బీహారులో భూకంపం అప్పుడే వచ్చింది. ఆ కారణంగా జైలునుండి విడుదలచేయబడి పునర్నిర్మాణ కార్యక్రమ భారాన్ని వహించిన రాజేంద్రబాబుకు మేము స్వచ్ఛంద సేవకులుగా

వస్తామని విన్నవించు కున్నాం స్థానికంగా కొంత ధనాన్ని ప్రోగుచేసి అందించాం. రాజేంద్రబాబు లోగడ ఒకసారి మా ఆశ్రమానికి వచ్చి ఒక రోజు వుండటం చేత, ఆ పరిచయం కొద్దీ. అవసరమయినప్పుడు కబురుచేస్తానని స్వయంగ జవాబిచ్చాడు. సత్యాగ్రహంలో ప్రవేశిద్దామంటే గాంధీజీ నిషేధించాడు. ఖద్దరు పనిని ముమ్మరంగా చేపడదామా అంటే దానికి అఖిలభారత చరఖా సంఘం అడ్డుపుల్ల వేసింది. ఇక హరిజన కార్యక్రమం అస్పృశ్యత రెండే మిగిలాయి. నేను జైలులో తెనిగించిన 'అమ్మ' గ్రంథాన్ని సాపు వ్రాయడంలో నిమగ్నుడ నయినాను.

కొద్దిగా ఖద్దరు వుత్పత్తి, జాతీయ పాఠశాల నిర్వహణ మొదలైన కార్యక్రమాలతో యితరులు కాలక్షేపం చేశారు. ఆశ్రమం యొక్క ఆర్థిక పరిస్థితులు సన్నగిల్లడంతో అందరిని ఒకేచోట భోజనాలు యేర్పాటు చేయబడినాయి, ఆడవాళ్ళందరూ అన్యోన్యంగా వంట చేస్తూంటే క్లుప్తంగా, గుట్టుగా రోజులు వెళ్ళబుచ్చడం జరిగింది. ఇంతలో జైలులోనున్న మిత్రులు కూడా విడుదలై వచ్చారు, అందరికి ఒకటే సమస్య. ముందేమి చేయాలి ! దానికి మనసుకు నచ్చిన సమాధానం రాక తికమకలు పడ్డాం.

1933వ సం॥లో హరిజనాశ్రమంలో వుంటుండగనే సుబ్రహ్మణ్యం గార్కి క్షయవ్యాధి అంకురించిఃది, తాత్కాలికమైన చికిత్సవలన కొంత ఉపశమించింది. కానీ వ్యాధి నిర్మూలనం కాలేదు. 1934 సం॥ వేసవిలో ఆయనకు చాల ప్రమాదకరమైన జబ్బు చేసింది. కఫం గొంతుపట్టేసింది. దాదాపు ఆయన మృత్యువుతో పోరాటాన్నే సాగించాడు. వైద్య సహాయం కోసం రాజమండ్రి నుండి ఎందరో డాక్టర్లు వచ్చారు డా॥ పాలకోడేటి గురుమూర్తి గారు అందరి సలహాలతో వైద్యం చేశారు. ఆయన తుది ప్రయత్నంగా ఒక యింజక్షన్ యిచ్చి చేతులెత్తి భగవంతుని ప్రార్థించాడు ఆ స్థితిలో మేమంతా యెంతటి నిస్సహాయ నిస్పృహలతో వున్నామో చెప్పనక్కర్లేదు.

సుబ్రహ్మణ్యంగారు మృత్యువుతో అలా పోరాడుతూ 'My soul shall live as a monument of Resistence to British Imperialism' (నా ఆత్మ బ్రిటీష్ సామ్రాజ్య ప్రతిఘటనకు శాశ్వత చిహ్నంగావుండుగాక!) అని గట్టిగా కేక లేయటం మొదలెట్టారు. మేమంతా దేవుడ్ని ప్రార్థిస్తూ నిశ్చేష్టులై వుండిపోయాము. ఈశ్వరానుగ్రహం వలన అప్పటి కాయన కా గండం తప్పింది. కొంచెం బలం చేకూరడంతోనే ఆయన బళ్ళారి సాం దూర్‌లో కొన్ని నెలలపాటు విశ్రాంతి తీసుకున్నారు. ఆ విశ్రాంతి ఆయన జబ్బును తాత్కాలికంగా పోగొట్టింది. శీతాకాలంనాటికి ఆయన తిరిగి సీతా నగరం చేరుకున్నారు. అప్పటికి ఆ గ్రామంలోని సభ్యులందరూ జైళ్ళనుండి విడుదలై వచ్చేశారు. కానీ చేతినిండా మనస్సుకు నచ్చిన పని లేక విరుత్సా హంగా కాలం గడపవలసి వచ్చింది. ఆ స్థితిలో ప్రప్రథమంగా మద్దూరి అన్నపూర్ణయ్య ఆశ్రమాన్నుండి బయటికి పోవడానికి నిశ్చయించుకున్నాడు. అందుకు ప్రధాన కారణం- ఆయనకు ఆర్థికంగా ఆశ్రమ జీవిత విధానం నచ్చక పోవడం. ఒక రోజున రాత్రిపూట ఆశ్రమ సభ్యుల సమావేశం జరి గింది. అందులో అన్నపూర్ణయ్య తన నిశ్చయాన్ని వెలిబుచ్చాడు. ఎవ్వరూ ఏమీ మాట్లాడలేదు. సుమారు ఒక పావు గంటసేపు అందరూ మౌనం దాల్చారు. ఎవ్వరూ మాట్లాడకుండానే సమావేశం ముగిసింది. అన్నపూర్ణయ్య ఆశ్రమాన్ని వదలి రాజమండ్రి చేరేడు. కొద్దిగా పిత్రార్జితము వుంటే ఆ భూమిని అమ్మి ఒక వారపత్రికను స్థాపించాలనుకుని సంకల్పించుకుని ఆ పనిలో నిమగ్నుడయ్యాడు. 'నవశక్తి' అనే పేరుతో పత్రికను ప్రారం భించి కొంతకాలం నడిపి దానిని కమ్యూనిస్టుల పరం చేశాడు.

గరిమెళ్ళ నర్సింహమూర్తి, రామచంద్రుని వెంకటప్పగార్లిద్దరూ రాజ మండ్రిలో ఇండియన్ ఏజన్సీస్ అనే పేరిట ఒక స్వదేశీ దుకాణాన్ని పెట్టు కున్నారు. సుబ్రహ్మణ్యంగారి సోదరుడైన మాజీ విద్యాశాఖాధికారి సీతా రామయ్యగారు బొంబాయి రాష్ట్రంలో ప్రధానాధ్యాపకుడుగా వెళ్ళిపోయాడు. ఖద్దరు కేంద్రం అందుకు సంబంధించిన వాళ్ళు మాత్రం క్లుప్తంగా ఆ కార్య

క్రమాన్ని నిర్వహిస్తూ వుండేవాళ్ళు. ఎ. ఐ యస్ ఏ వాళ్ళు మాత్రం మాకిచ్చిన 25 వేల రూపాయలు మింజువలె మాకు బాగా లాభదాయకంగా వుండే పిఠాపురం కేంద్రాన్ని వారి కప్పచెప్పాము. దానిమీద దాదాపుగా 10వేల రూపాయల వరకూ లాభం వచ్చింది. ఆ లాభాన్ని మా కొతాకు జమ కట్టుకోమని గాంధీజీ సిఫార్సు చేసినా అఖిల భారత చరఖా సంఘం మార్వాడీలు అంగీకరించలేదు. తగినంతగా పెట్టుబడిలేని కారణం చేత ఇద్దరు పరిశ్రమ విస్తృతంచేయలేక పోయాం. ఈ నిస్సహాయస్థితికి తోడుగా గ్రామాలలోని పెద్దలు కొంతమంది అసూయాగ్రస్తులు బయలుదేరారు. అక్కడికీ మాలో ఎవరూ వూరికే కూర్చోలేదు. ఎవరికి తోచినపని వారు చేస్తూనే వున్నారు. హనుమంతరావు, పోచయ్య కలసి హరిజనాశ్రమంలో హరిజనులను, యితరులను కలిపి ఒక ఎలిమెంటరీపాఠశాల నడుపుతూవున్నారు. ఆశ్రమ వాసులు ఏమీ పని చేయకుండా వున్నారనీ, గ్రామాలలో క్రొత్తగా బయలుదేరిన నాయకులను సరిగా గుర్తించడంలేదని ఈర్ష్యా పూరితమైన గుస గుసలు బయలుదేరాయి. ఆశ్రమంలో చదువుకుని పెద్దవారైన వారిలో కూడా అలాటి వికృతభావాలు కలగడం దురదృష్టమే కానీ అది కాలమహిమ. ఈనాడు వాటిని త్రవ్వుకుని ప్రయోజనంలేదు. కాని అందువల్ల సుబ్రహ్మణ్యంగారికి మనస్తాపం కలగడమే కాకుండా ఆశ్రమ సభ్యులకు కూడా చికాకు కల్గించింది. ఈ అఖాండాన్ని మన మేవిధంగా ఎదుర్కోవాలన్న విషయాన్ని ఒకసారి అంతా చర్చచేశాం. డాక్టర్ సుబ్రహ్మణ్యంగారు మనం గ్రామాలకుపోయి అక్కడ ప్రజలను ఏ ఉమ్మడి చోటనో చేర్చి వారికి పత్రికలను, పుస్తకాలను చదివించి, వినిపించి వారి ఆదరాభిమానాలను చూరగొనాలన్నారు. ఆ పద్ధతి కెవ్వరూ అంగీకరించలేదు. అది బొత్తిగా పురాణం శాస్త్రిలవారి తంతవుతుందని ఒకరు వెటకారం చేశారు. అందుమీద సుబ్రహ్మణ్యంగారు కొంత నొచ్చుకున్నారు. సాధారణంగా ఆయనతో మాట్లాడేటప్పుడు మాకు చాల చనువుండేది. అవాడెందుకో ఆయన దాని ఫలితంగా నొచ్చుకున్నారు. ఆ కారణంగా ఆయన మాతో వుండక హరిజనాశ్రమంలో ఒక్కడే వుంటూ

వచ్చారు. అందుకు కారణం మాకు ముందుగా తెలియదు. కానీ వూరిలో మాలో మాకు అభిప్రాయభేదాలు వచ్చాయని చెప్పుకునే గుసగుసలు మా చెవుల పడినప్పుడు మాత్రం అందరికి కష్టంగా తోచింది. రాత్రి 8 గంటలు మొదలు అర్ధరాత్రి వరకూ మాలో మేము చర్చలు జరుపుకున్నాం. అంతటితో మా ఆశ్రమాన్ని రద్దు చేయాలని (Disband) ఒక నిర్ణయానికి వచ్చాం. అది ఆశ్రమ చరిత్రలో ఒక మహత్తర ఘట్టం. అప్పుడే సుబ్రహ్మణ్యంగారిని తీసుకు రావడానికి ధరణీప్రగడ శేషగిరిరావును పంపేం. అతడు సుబ్రహ్మణ్యంగారిని నిద్రలేపి వెంటనే ఆశ్రమానికి రావలసినదిగా కోరేడు. ఎందుకంటే కారణం చెప్పలేదు. కారణం గుచ్చి గుచ్చి అడిగినా శేషగిరిరావు మౌనం వహించాడు. ఆ స్థితిలో యిద్దరూ సమావేశానికి వచ్చారు. పది నిమిషాలపాటు ఒకరి నొకరు చూచుకోవడమేగాని, ఎవరికీ నోటమాట రాలేదు. ఆఖరుకు అతి కష్టంమీద నేను లేచి 'మిమ్మల్ని ఈ ఆశ్రమాన్ని మీ చేతులతోనే Disband చేయాలని కోరుతున్నాం' అన్నాను. అందరూ అవుననే సరికి ఆయన నిశ్చేష్టుడైనాడు. అందుమీద గాంధీజీ సబర్మతి ఆశ్రమాన్ని రద్దు చేసిన విధానాన్ని చెప్పి, ఎవరి చేతులతో నిర్మాణం చేసిన సంస్థను దాని అవసరం తీరిన మీదట వారిచేతులతోనే రద్దుచేయడం క్షేమ కరమని గట్టిగా చెప్పేం. ఆయనకు కళ్ళలో నీళ్ళు తిరిగాయి. జలజల అశ్రువులు రాలేయి. మేమూ అలాటి స్థితిలోనే వున్నాం. చివరికి కారణాలలోకి దిగేం. మేము సోమరుల లాగున కూర్చుంటున్నామనీ, మీరు జిల్లాలో తిరిగి డబ్బు సేకరించి మమ్మల్ని అనవసరంగా పోషిస్తున్నారనే భావం జనంలో పుట్టిందనీ, మీరు వేరుగా వుండడానికి కూడ యిదే కారణమని ప్రజలనుకుంటున్నట్లు మా చెవిన పడిందని, ఆ స్థితిలో మేము యిక్కడ వుండడం న్యాయం కాదని చెప్పేము. ఆశ్రమంలో తగినంత పని లేకపోవడం చేత మేము వెళ్ళిపోవడానికి నిశ్చయించుకున్నామని చెప్పాం. ఆయన కొద్ది నిమిషాలు పస్తాయించి ఎవరో అనుకున్నదానికి మీరెందుకు కలవర పడాలనీ, మీరందరు యిక్కడ వున్నారు కనుకనే నాకు జనం

డబ్బు ఇస్తున్నారని మీరందరూ ఎంతెంత సమర్థులో నాకు తెలుసునని, తానొక్కడు ధన సేకరణలో వుంటుంటే, మిగతా పదిమంది పదిరకాలుగా రకరకాల నిర్మాణ కార్యక్రమాలలో నిర్విచారంగా పనిచేయు గల్గుతున్నారని, తనకు ఆశ్రమాన్ని మరల వున్నత స్థితికి తీసుకు రావడానికి 3 నెలలు గడు విమ్మని కోరేరు. వెంటనే తాను మరల ఆశ్రమంలో వుండి పుకారులకు తావివ్వనని చెప్పేరు.

# కస్తూర్బా సంస్థగా మార్పు

1933 సం॥ అఖరు వరకూ సీతానగరం సత్యాగ్రహాశ్రమం స్వాతం త్రోద్యమములో విశిష్టపాత్రను ధరించిన సంస్థ. 1942 సం॥రము విప్లవోద్య మములో అజ్ఞాతముగా ఉండిపోయింది. ఆశ్రమాన్ని వదలిపోయిన కొందరు వ్యక్తిగతముగా ఉద్యమాల్లో పాల్గొన్నాము. కొద్దిమంది ఖద్దరుసేవ చేస్తుం డిన వారికి ఆశ్రయంగానే ఆశ్రమము ఉండిపోయింది. రాజకీయ వాసనలేమీ దానిమీద సోకలేదు. ధరణీప్రగడ శేషగిరిరావు కుటుంబము మాత్రము చరఖాసంఘం వారి సౌజన్యంతో అక్కడ ఉండిపోయింది.

1943 ఆఖరున, గాంధీజీ సతీమణి కస్తూర్బా పూనాలో ఆగాఖాన్ భవనములో గాంధీజీ ఒడిలో మరణించింది. ఆమె పేరిట స్త్రీ శిశుజనాభ్యు దయానికి, నిధివి వసూలు చేయడము సంభవించింది. ఆ నిధిని వసూలు చేయడంలో అప్పట్లో జైలు వెలుపలనున్న బులుసు సాంబమూర్తిగారూ, శ్రీమతి దుర్గాబాయమ్మగారు ప్రధానపాత్ర వహించి ఆంధ్రదేశమంతా సంచా రము చేసి చాల ధనాన్ని వసూలు చేశారు. ఆ ధనంలో కొంతభాగాన్ని ఆంధ్రదేశంలో ఖర్చుపెట్టడానికి సీతానగరము ఆశ్రమము ఒక శిక్షణ కేంద్ర ముగా నిర్ణయింపబడింది. ఆశ్రమంలో ఉంటూ ఉండిన వైద్యాలయాన్ని పునరుద్ధరించి నిర్వహించడం జరిగింది. భారత చరఖాసంఘమువారు మా దగ్గరనుండి పుచ్చుకొన్న స్థిరాస్తులన్నిటినీ కస్తూర్బా ట్రస్టుకు ఒప్పచెప్పేరు.



స్వర్గీయ రామచంద్రుని వెంకటప్పగారు
టంగుటూరు జన్మస్థలం. సీతానగర ఆశ్రమ సభ్యులు.
5 సం॥లు పైగా జైలుశిక్ష అనుభవించారు.
జననం : 1902 — మరణం : 1978



స్వర్గీయ చండ్రుపట్ల హనుమంతరావుగారు
గాంధీజీ దండియాత్రలో ఆశ్రమం ప్రతినిధి..
4 సం॥లు జైలుశిక్ష అనుభవించిన
స్వాతంత్ర్య సమరయోధుడు.

1946 సం॥రంలో ప్రకాశం ప్రభుత్వ మేర్పడిన పిమ్మట కస్తూర్బా నిధి సంస్థలకు కొంత ప్రోత్సాహము లభించింది. 1947 సం॥రం స్వాతంత్ర్యము సిద్ధించిన పిమ్మట మద్రాస్ ప్రభుత్వ యాజమాన్యంన వారి పర్యవేక్షణలో నిర్వహింపబడిన అభివృద్ధి కార్యక్రమాలలో స్త్రీ జనవిభాగానికి సీతానగరం ఆశ్రమం ప్రధాన కేంద్రమైనది. కస్తూర్బా నిధి ఏష్యం కావడము, బ్లాకు డెవలప్‌మెంట్‌లో మార్పులు రావడమువల్ల దాని ప్రాముఖ్యత నేడు తగ్గింది. ఆస్పత్రి బాగా అభివృద్ధి అయింది. నూతన భవనాలు నిర్మాణము చేయబడినాయి. నేడు అది కస్తూర్బా స్త్రీ జనాభ్యుదయ సంస్థగా నిలిచి వుంది.

ఆశ్రమానికి సంబంధించిన కొందరు వ్యక్తులు సత్యాగ్రహాశ్రమానికి సంబంధించిన కొందరు వ్యక్తులనుగురించి సంగ్రహముగా చెప్పవలసి వుంది. వారిలో కొందరు అజ్ఞాతులుగా వుండే మరణించారు. సామాన్య కుటుంబాలలో నుండి ఈ ఉద్యమంలోకి వచ్చి నిరుపమానమైన త్యాగాలను చేసిన వారున్నారు. 1945 సం॥రం ఆఖరున ఒకసారి డాక్టరు పట్టాభిగారు సీతానగరం వచ్చారు. అప్పటికి కస్తూర్బా ట్రస్టు వారింకా అచ్చట పూర్తిగా ప్రవేశించిన గుర్తులేదు. రాజకీయముగా సుబ్రహ్మణ్యంగారు పట్టాభిగారికి సన్నిహితులు కారు. 1930 సం॥రం నుండి పట్టాభిగారికి సుబ్రహ్మణ్యంగారిపట్ల ఒక ఆప్యాయత ఏర్పడింది. ఆ సందర్భాన్ని గురించి పట్టాభిగారు మిత్రులగోష్టిలో మాట్లాడుతూ, రకరకాల ఆవేశాలుగల మీ అందరినీ ఒకచోట చేర్చి, సుబ్రహ్మణ్యము యెలా నిగ్రహించుకు వచ్చాడు ? దాని రహస్యమేమిటి ? అని ప్రశ్నించారు. అందుమీద నేను "సుబ్రహ్మణ్యం గారి ప్రజ్ఞను ఈ విధంగా వివరించాను : సుబ్రహ్మణ్యంగారికి తీవ్రమైన రాజకీయాభిప్రాయాలుండేవి. కాని, వాటిని తన అనుచరుల మీద రుద్దాలనే పట్టుదల ఆయనకుండేదికాదు. అందరినీ తన స్నేహితులుగా. సమానులుగా భావించేవాడు. ఒక సమస్య వచ్చినప్పుడు, అందరూ కలసి ఈ విధముగా

పోతే బాగుంటుందని చెపితే తన అభిప్రాయానికి బొస్తుతులాలు పెట్టుకొని నలుగురితో పాటు నడిచేవాడు. ఒకానొక విషయంలో ఆయన ఇతరులతో ఒక ఏర్పాటుకు వచ్చినప్పుడు, నా మాట దక్కించమంటే మేమంతా కిమ్మనకుండా అనుసరించే వాళ్ళం! ఆ విధమైన ఒదుగులలోనే సుబ్రహ్మణ్యంగారి ప్రజ్ఞారహస్యమున్నది. అని చెప్పేను. ఆ సమాధానానికి ఆయన సంతృప్తి చెందేడు. ఆశ్రమంలో ఉండిన మనుష్యులు అందిరిపట్ల పట్టాభిగారికొక ఆదరభావం కలిగింది. అందుచేతనే ఆశ్రమ ఖాదీ విభాగానికి చెందిన వోలేటి నరశింహం, వంగల సత్యనారాయణ, మద్దూరి కృష్ణమూర్తి గార్లను చరఖా సంఘము ఉద్యోగాల్లోకి తీసుకొన్నాడు.

కొన్ని సవరణలు;

సుబ్రహ్మణ్యంగారి అస్వస్థత కారణముగా ఆశ్రమంలో ఏర్పడిన స్తబ్దత వలన ఆశ్రమవాసులు తీసుకున్న నిర్ణయాన్ని గురించి, ఆశ్రమ సభ్యులైన శ్రీ చంద్రుపట్ల హనుమంతరావుగారిల్లా వ్రాస్తున్నారు :

"ఆశ్రమంలో తగినంతపని లేదనుకొన్నవారు వృధాగా ఆశ్రమం మీద భారంగా ఉండటం కంటె ఆశ్రమాన్నుండి నిష్క్రమించడమే మంచిదని, అందుచేత క్రమముగా ఒక్కొక్కరే కొంత కాలవ్యవధిలో బైటకు పోవాలని" నిశ్చయించి అది అమలు పరచుకొన్నారు. అయితే ఆ బైటకు పోవడము ఒక్కుమ్మడి నిరసనగా గాకుండునట్లు సుహృద్భావంతోనే సుబ్రహ్మణ్యంగారికి నచ్చచెప్పే పోవాలని నిశ్చయించి అట్లాగే చేశారు.

దీని ప్రకారం అందరికంటె ముందుగా పత్రిక పెట్టదలచుకొనుటకు నిశ్చయించి వెళ్ళినవాడు శ్రీ అన్నపూర్ణయ్య. తరువాత ప్రకాశంగారి పిలుపు ననుసరించి స్వరాజ్యంలో పని చేయుటకు వెళ్ళింది లింగరాజు. గరిమెళ్ళ నరశింహమూర్తి, వెంకటప్పగారలు ఇండియాన్ ఏజెన్సీస్ పెట్టుకొని రాజమండ్రి చేరారు. తక్కిన వాళ్ళ సంగతి మరేమీ వ్రాయలేదు. ఈ నిర్ణ

యాన్ననుసరించే నేను, డాక్టరు దీక్షితులు తరువాత క్రమముగా ఆశ్ర మాన్నుంచి వచ్చేశాము. దీక్షితులు రాజమండ్రిలో ప్రాక్టీసు ప్రారంభించారు. నేను ఇందుకూరు పేట చేరి భవిష్యత్ కార్యక్రమం వెతుక్కుంటూ మెల్లగా కాంగ్రెస్ ప్రచార కార్యాక్రమం చేపట్టడం మొదలుపెట్టాను. గుండేపూడి రామకృష్ణశర్మ రాజమండ్రి ఖాదీ విక్రయశాల్లో పనిచేస్తూ క్రమంగా స్వంత ఖాదీడిపో పెట్టుకున్నాడు. ఓలేటి నరసింహము, మద్దూరి కృష్ణమూర్తి, వంగల సత్యనారాయణ ఆశ్రమంలో చిన్న స్కేల్లో నడుస్తూన్న ఖద్దరుత్ప త్తిలో నిమగ్నులై యున్నారు. ధరణీప్రగడ శేషగిరిరావు మాత్రం సుబ్రహ్మణ్యంగారిని వదలక అక్కడే ఉన్నాడు.

1932 సం॥రంలో ముస్తఫాలీ ఆశ్రమం మీద దాడి జరిపినపుడు ఆ జట్టులో శ్రీ గూడూరి రంగయ్యగారు కూడ వున్నారని శ్రీ రంగయ్యగారు తెలియ చేస్తున్నారు.

ఆశ్రమ చరిత్రను ముగించేముందు కధాక్రమంలో చెప్పడానికి అవ కాశం కలుగని కొందరు వ్యక్తుల గురించి క్లుప్తంగానైనా చెప్పడం న్యాయం, అలాటి వారిలో ప్రథమంగా చెప్పుకోవలసినవారు శ్రీ మాచిరాజు శ్రీరామ చంద్రమూర్తి అనే పేరుగల బండరాముడు. ఆ పేరు చెబితేగాని అతను గుర్తురాడు, అతడి స్వస్థలం అమలాపురం ఆ వూరి కిరణాల కుటుంబంలోని వాడు. చిన్నప్పుడు చదువు సంధ్య లంతగా అబ్బలేదు. కసరత్ చేయడంతో కుస్తీపట్లు పట్టడంలో దిట్ట. నాటకాలలో వేషాలు వేయడంలో సమర్ధుడు. ఈ కారణాల చేత బండరాముడనే పేరు అతడికి సార్ధకమైంది. ఎప్పుడూ శిష్య పరివారంతో పై కార్యక్రమాల్లో నిమగ్నుడై ఉండేవాడు. 1920 సం॥రంలో అతనికి శ్రీ సుబ్రహ్మణ్యంగారితో పరిచయమై స్వాతంత్ర్యోద్యమంలో ప్రవే శించాడు, రాజమహేంద్రవరంలో స్థావరమేర్పర్చుకున్నాడు. ఆ కాలంలో గాంధీజీ వంటి జాతీయ నాయకులు వచ్చినపుడు వారికి స్వాగతాలివ్వడానికి వేలాది జనం మేళ తాళాలతో వచ్చేవారు. అలాటి యేర్పాట్లకు యజమాని

బండరాముడు. మాటలలో చేతలలో హాస్యగాడు. అతడుంటే కాలక్షేపానికి లోటుండేదికాదు. అమలాపురం స్కూలులో చాల నిదానంగా చదివిన కారణం చేత, చాల ఉన్నతోద్యోగాలు చేస్తూండిన వారంతా అతడికి సహాధ్యాయులు. 1922 సం॥రంలో జనవరిలో రాజమండ్రిలో 144 వ శెక్షన్ శాసన ధిక్కారం చేసిన కారణంగా డా॥ గురుమూర్తి, కె.వి.ఆర్. స్వామి, బేతిన వీరన్న, సబ్బారపు అప్పలస్వామిగార్లతోపాటు రెండు నెలలు మద్రాసు జైలులో శిక్షననుభవించాడు. అప్పట్లో అందరికి జైలు జీవితం క్రొత్త; కఠినంకూడా: కానీ బండరాముని చేష్టలవలన, హాస్యంవల్ల రోజో క్షణంగా గడిచేదం, శిక్షించడానికి వచ్చే వార్డరులను, అధికారులను నవ్వించేసేవాడని వీరరాఘవస్వామినాయుడుగారు చెబుతుండేవారు. 144వ శెక్షన్‌ను ధిక్కరించడాన్కి అతడిని వేదిక యెక్కి మాట్లాడమంటే "నేను తద్దినం పెట్టె వాడి తమ్ముడ్ని. నాయుడుగారు చెప్పేదే నేనూ చెప్తున్నాను" అని కూర్చున్నాడు. అందుకే 6 వారాలు శిక్ష ననుభవించాడు. 1924 సం॥రంలో ఆశ్రమంలో చేరేడు. అయితే అతని నొక శిక్షణలో వుంచడమే సాధ్యంకాలేదు. నాటకాల సంచారంలో నెలలు గడిపేసేవాడు. అందుచేత అతడే రెండు మూడు సంవత్సరాలు అయిన తర్వాత రాజమహేంద్రవరం చేరి ఖద్దరు దుకాణంలో చేరి కాలం గడిపేడు. అతడిని సినిమారంగంలోకి పి. పుల్లయ్యగారు ప్రవేశపెట్టారు. కానీ, ఆ రంగంలో కూడ డైరెక్టర్లు అదుపులో ఒదిగి వుండని కారణం చేత, అతడి సామర్థ్యం తగినంతగా రాణించలేదు. 1949 సం॥లో చాలకాలం ఉబ్బుఖాయిలావల్ల బాధపడి మరణించాడు. కడుపుబ్బ నవ్వించే కథలు, చేష్టలు దాదాపు తెనాలిరామలింగని కథలన్నీ వున్నాయి.

శ్రీ మానాప్రగడ వెంకటకృష్ణారావు :- ఈ యువకుడు రాజమండ్రి వీరేశలింగంగారి స్కూలులో 4వ ఫారమో. 5వ ఫారమో చదువుతూ దానికి స్వస్తి చెప్పి గాంధీగారి వుద్యమంలో ప్రవేశించి, సుబ్రహ్మణ్యంగారి ఆశ్రయంలో చేరేడు. ఆదినుంచీ అతనికి కార్మికులలా పనిచేసే అభిలాషయుండేది.

సీతానగరం సత్యాగ్రహాశ్రమంలో చేరడంతోనే అతడు చుట్టు ప్రక్కలవుండే గ్రామాలలో హరిజన సేవ చేస్తూండేవాడు. రాత్రింబవళ్ళు హరిజనవాడల్లోనే వుంటూ వాళ్ళకు తలలో నాలుకగా వుండేవాడు. వాళ్ళకు సహాయం చేయ డంలో అతనిదీ పైవాళ్ళదీ అనే తేడా లేకుండా సొమ్ము ఖర్చు పెట్టేడు. అందుచేత కాలక్షేపానికి తగినంతగా వుండే పిత్రార్జితాన్ని కరగబెట్టేశాడు. అతడి భార్య సుందరమ్మ కూడా 1932 సం॥రంలో ఉద్యమంలో పాల్గొని జైలు శిక్ష ననుభవించి కొద్ది కాలానికే క్షయ వ్యాధికి బలైంది. సుబ్రహ్మ ణ్యంగారు మరణంతో కృష్ణారావు కూడ ఆశ్రమాన్ని వదలి చుక్కాని లేని పడవ వలె అజ్ఞాతంలోకి వెళ్ళిపోయి కొద్ది సంవత్సరాల క్రిందటనే మరణించాడు.

జోస్యుల అప్పలరామమూర్తి :

1925 సం॥రంలో ఆశ్రమంలో చేరేడు. ఆయన స్కూల్ ఫైనల్ పరీక్ష మొదలు ఎఫ్. యల్. పరీక్షవరకూ అన్నిటిలోను ప్రథమ శ్రేణిలో ప్రథముడుగా ఉత్తీర్ణుడైన బుద్ధిశాలి. 1920 వ సం॥రంలో బి. యల్. పరీక్ష కెళ్ళేముందు చదువుకు తిలోదకాలిచ్చి ఉద్యమంలో చేరేడు. ఆచంట గ్రామ ములో నిర్మాణ కార్యక్రమాన్ని చేపట్టి ఖద్దరు ఉత్పత్తి విక్రియాన్ని సాగిం చాడు. అందులో కొంతసొమ్మును పోగొట్టుకున్నాడు. పిమ్మట చంద్రుపట్ల హనుమంతరావు, ఆయనా ఒక్కసారి ఆశ్రమంలో చేరి ఖద్దరు ఉత్పత్తి కార్యక్రమం సాగిస్తూండేవారు. ఇంగ్లీషు, తెలుగు, భాషల్లో మంచి రచయిత. గొప్ప ధారణాశక్తి గలవాడు. గ్రామాభ్యుదయం పట్ల విశేషమైన ఆశక్తి కలవాడు. వ్యక్తిగత కారణాలవల్ల 1929 సంవత్సరంలోనే ఆయన ఆశ్ర మాన్ని వదలి పోయాడు. పశ్చిమగోదావరి జిల్లాలో సత్యాగ్రహోద్యమంలో పాల్గొని జైలు కొచ్చాడు. కొంతకాలం నరశింహదేవర సత్యనారాయణ గారితో తూర్పు గోదావరిజిల్లా ఆలమూరులోనూ గోపెటి జోగిరాజుగారితో పిఠాపురం తాలూకా కొండెవరంలోనూ సహకారోద్యమం ద్వారా గ్రామా

భ్యుదయంలో పనిచేశాడు. 1946 సంవత్సరంలో ప్రకాశం ప్రభుత్వంలో పశ్చిమగోదావరి జిల్లా ఫిర్కా డెవలెప్‌మెంట్ ఆఫీసరుగా కొంతకాలం పని చేశాడు. ఆ స్కీము రద్దయిన పిమ్మట కాలేజీ విద్యార్థులకు పాఠాలు జెప్పి కాలక్షేపం చేశాడు. 4, 5 సం॥రాల క్రిందటనే స్వర్గస్థుడైనాడు.

గూడూరి రంగయ్య :

ఈతడు కర్నూలు జిల్లా గిద్దలూరి వాసి. తల్లాప్రగడ నరసింహాశర్మ గారి శిష్యుడుగా రాజమహేంద్రవరం చేరాడు. వృత్తి కుట్టుపని; ఖద్దరుతప్ప వేరేబట్ట కుట్టని దీక్షతో గాంధీ ఉద్యమంలో చేరాడు, పిమ్మట ఆశ్రమం ఖద్దరు దుకాణంలో కుట్టుపని చేస్తూండేవాడు. 1932 సం॥రంలో ముస్తఫాలీ లాఠీచార్జికి గురియై దేహశుద్ధిని పొందినాడు. ఆశ్రమవాసులతోపాటు నాలుగు సంవత్సరముల శిక్ష విధింపబడి రెండు సంవత్సరములు అనుభవించి విడుదలైనాడు. ప్రస్తుతము రాజమహేంద్రవరం దానవాయిపేటలో స్వంత ఇంటిని కట్టుకొని గుట్టుగా కాలక్షేపం చేస్తున్నాడు. వయస్సు. దాదాపు 62 సం॥రంలు దాకా వుంటాయి.

గట్టిం సూర్యనారాయణ ;

'కాంగ్రెస్' పత్రిక ముద్రణాలయంలో కంపోజిటరుగా 1927 సం॥రంలో ఆశ్రమంలో ప్రవేశించాడు, సమర్థుడైన కంపోజిటరు. బలమైనశరీరం కలవాడు కాడు. 1932 సం॥రంలో ముస్తఫాలీ దాడి జరిగేముందు అతనిని ఇష్టమైతే ఆశ్రమంనుండి వెళ్ళిపోవల్సిందిగా సలహా ఇవ్వడము జరిగింది. 5 సం॥రంలు ఆశ్రమం జీవితంవల్ల కలిగిన రాజకీయ చైతన్యంవల్ల బ్రహ్మచారియైన సూర్యనారాయణ మిగతా వారందరితోపాటే వుండిపోయాడు. పోలీసులు బాగా దేహశుద్ధి చేశారు. ఆ దెబ్బలకు కాతడు బ్రతకడమే దైవానుగ్రహం ! 2 సం॥రాల కఠినశిక్ష ననుభవించాడు, వయస్సు దాదాపు 60 సంవత్సరా లుంటాయి. ఇప్పటికీ ఓంకారస్వాములవారి తోటపల్లి శాంతి

ఆశ్రమంలో కంపోజిటరుగా పనిచేస్తూ కాలక్షేపం చేస్తూన్నాడు. అలాటి సామాన్యులు చేసిన త్యాగమే స్వాతంత్రోద్యమానికి అమోఘమైన బలం చేకూర్చింది. అలాటివారికి పెద్దతనంలో ఒకరిమీద ఆధారపడకుండా న్యాయమైన ఉపాధి కల్పించడం ప్రభుత్వంయొక్క ధర్మం. భూముల ఆశకల్పించి వారిని మరింత బాధించడమే అవుతోంది. కనుక అలాటి వారికి కొంత పింఛనులాంటి దివ్వడం న్యాయం.

వంగల సత్యనారాయణ :

దాదాపు కాంగ్రెసు పత్రికతోపాటే ఇతడుకూడా కంపోజిటరుగా చేరి పని నేర్చుకున్నాడు నిరంతరం పోలీసు నిఘాలో వుంటూ ఎన్ని ఆటంకాలొచ్చినా పత్రిక బయట పడడానికి అలాటివారే కారణం. 1932 సం॥రంలో ఆశ్రమం మీద దాడి జరిగినప్పుడు అతడుకూడా దెబ్బలుతిని జైలుకొచ్చాడు. తర్వాత డాక్టర్ పట్టాభిగారి పుణ్యాన చరఖాసంఘంలో చేరి నేడు రిటైరై కాకినాడలో వుంటున్నాడు.

మద్దూరి కృష్ణమూర్తి :

మద్దూరి అన్నపూర్ణయ్య తమ్ముడు, చిన్నప్పుడే ప్రభుత్వ విద్యాలయంలో చదువు మానేసి జాతీయవిద్యాలయంలో శిక్షణ పొందేడు. ఆశ్రమములో కంపోజిటరుగా పని నేర్చుకుని పత్రికా కార్యాలయంలో పనిచేస్తూండేవాడు. ఆశ్రమం తరఫున 1927 సం॥రంలో మద్రాసులో సాగిన సీలు సత్యాగ్రహంలో పాల్గొని జైలుశిక్ష ననుభవించినాడు. తిరిగి 1930లో, 32 లోనూ సత్యాగ్రహోద్యమాల్లో పాల్గొన్నాడు. మనిషి బలంగా ఉండడంచేత పోలీసులు అతని మీద స్వేచ్ఛగా లాఠీలను తాండవ మాడించారు. ప్రెస్ మరల తెరువబడని కారణంచేత చరఖాసంఘంలోచేరి రిటైరై నాల్గు సంవత్సరాల క్రిందట చనిపోయాడు. అతడు బ్రతికుండగా మన ప్రభుత్వ మాతని కేమీ సహాయం చేయలేదు. నిరాధారుడైన అతని కుమారుడు భూమి కోసం పడుతున్న అవస్థను పాటించే నాథుడు లేడు.

## శ్రీ గుండేపూడి రామకృష్ణశర్మ :

ఈయన సీతానగరం ఆశ్రమవాసి. 1932 సం॥లో ముస్తాఫాలీచేతుల్లో దేహశుద్ధిని పొందిన స్వాతంత్ర్య యోధుడు. ఈయన 1971 సం॥లో బెజవాడలో వెన్నెముకకు సంబంధించిన క్షయ మూలంగా మరణించాడు. 1932 నుండి స్వాతంత్ర్య ఉద్యమాల్లో పాల్గొని జైలుశిక్షల ననుభవించిన యోధుడు. సుబ్రహ్మణ్యంగారి తోడల్లుడు. సమర్థుడైన అకౌంటెంట్. చాలా కాలంగా రాజమండ్రిలోను రెండు మూడు మాసములుగా బెజవాడ ఆస్పత్రిలోను చికిత్స పొంది మరణించాడు.

స్థిరనివాసులు కాక ఇంకా యెందరో కొంతకాల ముండినవారు కూడా వున్నారు. ఆశ్రమ ప్రభావంలో వుండి, తమ జీవితాలను తమతమ ఉనికి పట్లలో గడుపుతూండే వారుకూడా ఎందరో వున్నారు. దాదాపు స్వాతంత్ర్యం వచ్చేవరకు ఆంధ్రదేశం మాట అటుండగా గోదావరి జిల్లాలో కలిసికట్టుగా పనిచేసే వారందరికీ సీతానగరం 'గ్రూపు' అని కొందరు గేలిచేసినా ఆ వర్గం వారి సహాయంలేకుండా ఎవరూ జిల్లాకాంగ్రెసు ఆధిపత్యాన్ని పొందలేదు. స్వాతంత్ర్యానంతరం కధ వేరు.

[ చాలకాల మైనతర్వాత వ్రాయబడిన యీ కధలో చిన్న చిన్న స్ఖాలిత్యా లుండవచ్చును. కొన్ని ఘట్టాలు ఉదహరింపబడక పోవచ్చును; కొందరు వ్యక్తుల సమాచారం రాకపోవచ్చును. అలాటి సవరణలను ఎవరైనా సూచిస్తే కృతజ్ఞతతో స్వీకరించి రెండోముద్రణలో సవరిస్తాము. ]

# ముగింపు

ఈ గ్రంథం వ్రాయబడి చాలాకాలమైనది. స్వాతంత్ర్య పోరాటంలో ఆశ్రమానికెంతో కీర్తిప్రతిష్టలను తెచ్చినవారిలో శ్రీ గూడూరి రంగయ్య, శ్రీ వంగల సత్యనారాయణ మరణించారు. ఆనాడు ఆశ్రమాభివృద్ధికి అండగా నిలచిన ప్రముఖులుకూడా చాలామంది స్వర్గస్తులైనారు. శ్రీ కాండ్రు వీరన్న గారు, చెరుకూరి సూరన్నగారు జీవించి వున్నారు. ఆ కాలంలో నేత పనుల్లోనూ, తదితర పనుల్లోనూ ఆశ్రమంమీద ఆధారపడి జీవించిన పిల్లలు, నడివయస్సువారు ఇంకా జీవించి ఉన్నారు. ఈనాడు కూడా వారా చరిత్రను, వ్యక్తులను తలుచుకుని ఆనందపడుతుంటారు. ఈనాడు కస్తూర్బా సంస్థగా ఎంత మార్పుచెందినా ఆశ్రమ ఆవరణలో కెళ్ళేసరికి ఆనాటి చరిత్ర స్ఫురణకొచ్చి ఆవేశపడుతుంటారు. గాంధీజీ ఆనాడు నివసించిన పాకను ఒక దేవాలయంగా భావిస్తారు.

క్రొవ్విడి లింగరాజు.



మద్దూరి అన్నపూర్ణయ్య

రాజమండ్రి గవర్నమెంటు ఆర్ట్సు కాలేజిలో బి ఎ. సీనియర్ చదువుతూ గాంధీజీ పిలుపు ననుసరించి చదువుకు స్వస్తి చెప్పిన యువకుడు 1921 మార్చిలో తూర్పుగోదావరిజిల్లా విద్యార్థి మహాసభ కార్యదర్శి. ఆ మహాసభలో 50 మంది విద్యార్థులుచదువులుమానివేసి డాక్టర్సుబ్రమణ్యం గారినాయకత్వంలో దేశస్వాతంత్ర్య సంపాదనకు అంకితమైనారు. అన్నపూర్ణయ్య జాతీయ విద్యాలయంలో అధ్యాపకునిగానుండి ఆంధ్ర యువజన కాంగ్రెస్‌ను ప్రారంభించి దాని యాజమాన్యమున కాంగ్రెస్ పత్రికను సైక్లోస్టయిలు పత్రికగా నెలకొల్పినాడు తర్వాత జాతీయ విద్యాలయంలో దానినిఅచ్చొత్తించేవారు అందులోవ్రాసినవ్యాసానికి 18 నెలలుశిక్షపొందినాడు. ఆపత్రికను 1925సం॥రం లోసీతానగరం ఆశ్రమానికి తరలించడం జరిగింది. 1929 లో "చిచ్చులపిడుగు" వ్యాసాన్ని ప్రచురించిన కారణంగా 2½ సంవత్సరాల శిక్షకుగురియైశిక్ష ననుభవించినాడు మరల1932లో ఆశ్రమదాడిలో కఠినమైనలాఠీదెబ్బలుతిని 4సం॥లు శిక్షపాలై 1934 సం॥ లో విడుదలైనాడు 1940ఏప్రిల్ నుండి1945 జూన్‌వరకు డిటెన్షన్‌లోఉన్నాడు రాజకీయంగా విప్లవవాది,సోషలిస్టు సుబాస్‌బాబు జయప్రకాశ్ మన్ననలకు పాత్రుడై యువజనులను రాజకీయంలో దుమికించిన నాయకుడు. మొత్తం పది సంవత్సరాల కారాగారశిక్షననుభవించిన త్యాగీ, ధీరుడు.



1922సంవత్సరంలో విశాఖపట్నంలో LMP చదువు మానివేసి సహాయనిరాకరణోద్యమంలో పాల్గొని 4 నెలలు రాజమండ్రి జైలులో శిక్ష ననుభవించినారు పిమ్మట యల్ ఎం పి పూర్తి చేసి రాజమహేంద్రవరం ఆర్యాపురంలోని స్వగృహంలో వైద్యవృత్తిసాగించినారు. డాక్టరుసుబ్రమణ్యం గారికోరికపైన ఆశ్రమం డాక్టరు ప్రవేశించినారు 1932 సం॥లో ఆశ్రమంమీద పోలీసులు ముస్తాఫాలీఖాన్ నాయకత్వాన దాడిచేసినప్పుడు ఆయనను [illegible]ముగా లాఠీఛార్జిచేసినారు పిమ్మట కేసుపెట్టి [illegible]సం॥లు కఠినశిక్షవిధించినారు 2 సం॥లు శిక్ష డాక్టర్ పంగపేటి వెంకట్రామ [illegible] తులు [illegible]ంచినపిమ్మట విడుదల చేయబడినారు పిమ్మట ఏ బి నాగేశ్వరరావుతోకలిపి వైద్య[illegible] సాగించారు 1938-41 వరకు 47-50వరకు రాజమండ్రి మ్యునిసిపాలిటి సభ్యులు.